ISLAM KA NIZAM - E - HAYAT
(Telugu)

# ధర్మపథంలో జీవనరథం

మూలం :

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది

అనువాదం :

ఎస్. ఎమ్. మలిక్




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్‌కోట్, ఛత్తాబజార్,
హైదరాబాద్ - 500 002

# ఇందులో ...

**అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో**

# పీఠిక

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీ 1948లో జనవరి నుండి మార్చి నెల వరకు ఉర్దూలో అయిదు రేడియో ప్రసంగాలు చేశారు. వాటిలో ఆయన, నైతికత, రాజకీయాలు, ఆర్థిక వ్యవస్థ, సామాజిక రంగం, ఆధ్యాత్మిక బోధనలు వంటి విషయాలను చర్చించారు. సంగ్రహమయిన ఆ ప్రసంగాలలో ముఖ్యమయిన, ప్రధానమైన అంశాలను మాత్రమే చర్చించడం సాధ్యం అని తెలుస్తూనే ఉంది. ఆ ప్రసంగాలు అటు తరువాత **"ఇస్లాం కా నిజామె హయాత్"** అన్న పేరుతో పుస్తక రూపంలో వెలువడ్డాయి.

ఈ ప్రసంగ పాఠాలను ఉర్దూలో ప్రచురించడమే కాక అనేక ప్రపంచ భాషల్లోనూ అనువదించి ప్రచురించడం జరిగింది. తెలుగులోనూ శ్రీ వై ఎం. పీరాఁ "ఇస్లాం జీవిత విధానం" అన్న పేరుతో తొలుత అనువదించారు. అయితే ఆ తరువాత ఇంగ్లీషులో వచ్చిన అనువాదంలో మరో అధ్యాయం 'జీవన దృక్పథం' అన్న శీర్షికన మౌలానా మౌదూదీ రచనల ఆధారంగానే సంకలనం చేసి ఇంగ్లీషు అనువాదకులు శ్రీ ఖుర్షీద్ అహ్మద్ జత చేశారు. ఈ అధ్యాయం ఇస్లామీయ జీవన

వ్యవస్థను అర్థం చేసుకోదలచిన పాఠకులకు ఎంతో ఉపకరించింది. తెలుగు పాఠకులకూ ఆ అవగాహనా సౌలభ్యం అందజెయ్యాలన్న భావంతో దాన్ని తెలుగులోనూ జత చెయ్యాలని సంకల్పించాము. ఆ సందర్భంలోనే మొదటి అనువాదాన్నీ పునఃపరిశీలించడం జరిగింది. అప్పుడు దాన్ని గ్రాంథిక భాష నుండి ప్రామాణిక వ్యావహారిక భాషలోకి మార్చడం కూడా పాఠకుల సౌలభ్యం కొరకు అవసరమే అనిపించింది. ఆ సంకల్పానికి ఆచరణ రూపమే ఇప్పుడు "ధర్మపథంలో జీవనరథం"గా మీ చేతుల్లో ఉంది.

సమకాలీన ఇస్లామీయ సాహిత్యంలో ఈ పుస్తకం, ఇస్లామీయ జీవన వ్యవస్థను గురించి, ఇస్లామ్ మౌలిక భావాలను గురించి పరిచయం చేసే ఉత్తమ పుస్తకాల్లో ఒకటని చెప్పవచ్చు. అయిదు సంగ్రహమయిన రేడియో ప్రసంగాల పరిమితుల్లో మౌలానా మౌదూదీ, ఇతరులయితే పెద్ద గ్రంథాల్లో చెప్పేదాన్ని ఎంతో సమగ్రంగా, స్పష్టంగా, క్షుణ్ణంగా, ప్రభావవంతంగా చెప్ప గలిగారు. నీతి, నైతిక భావనలయినా, రాజకీయాలు, ఆర్థిక విధానాలయినా, కుటుంబం, సామాజిక జీవితమయినా, ఆరాధనలయినా, ఆధ్యాత్మిక రీతులయినా అన్నింటినీ ఆయన వాటి అంతర్గత సూత్రాలను, వాటిని క్రియా రూపంలో పెట్ట డానికి కావలసిన విస్తృత సంవిధానాన్ని ఎంతో సంతులనంతో సమగ్రతతో విశదపరిచారు. ఇంత సంగ్రహరూపంలో ఇంతటి సువిస్తర విషయాలను సంపూర్ణంగా చర్చించిన వేరొక పుస్తకం మరో భాషలో నయినా రావటం బహు అరుదు అన్నా అది అతిశయోక్తి కాదేమో !

ఈ పుస్తకం, ఇస్లాం, ఇస్లామీయ వ్యవస్థ ఓ చర్చనీయాంశంగా ప్రపంచమంతటా అనుశీలించబడుతూ ఉన్న తరుణంలో, దృష్టిగల వారెల్లరి సునిశిత దృక్కులూ ఇస్లాంకు సంబంధించిన ఏ 'వ్రాత' నయినా సరే శల్యపరీక్ష చెయ్యడానికి నడుం బిగించిన ఈ అతి సున్నితమైన సమయంలో పాఠకులకు అందజేస్తున్నాము. భూమండలమంతటా వ్యాపించిన ముస్లిములు తమ వ్యక్తిగత సామూహిక జీవనరంగాలను, విశ్వకర్త తన సందేశహరుని ద్వారా పంపిన మార్గదర్శకత్వాని కనుగుణంగా మలచుకోవాలని తహతహలాడుతూ ఉన్నారు. ఈ సందర్భంలో మానవ జీవితంపై ఆధునిక సాంకేతిక వికాసాల వల్లనూ, పాశ్చాత్య (భౌగోళికమైన 'పాశ్చాత్య' కాదు ; భావపరమయిన, సంస్కృతీపరమయిన 'పాశ్చాత్య' లోకం అన్నది మా ఉద్దేశ్యం) ప్రభావం చేతను నెలకొన్న మార్పుల కారణంగా ముస్లిములు తమ ఈ ధ్యేయ సాధనలో అనేక ఇబ్బందుల్ని ఎదుర్కొంటున్నారన్నది వాస్తవం.

ముస్లిములు ఈ యుగం (!) లోనూ దైవ మార్గదర్శకత్వం వైపుకు మరలడం అన్నది కాలప్రవాహానికి భిన్న దిశలో పయనించడం కాదా? అన్న ప్రశ్న నేడు అనేక మందిని, స్వయంగా అనేక మంది ముస్లిములనూ వేధిస్తున్న ప్రశ్నే. మౌలానా మౌదూదీ రచనలు ఈ ప్రశ్నకు సమాధానాలుగా ముందుకు వచ్చిన తొల్దొలి కృషి అని చెప్పక తప్పదు.

అయితే ముస్లిములు తమ జీవితాలను ఇస్లాం బోధనల కనుగుణంగా మలచుకునేందుకు చేస్తున్న ఈ కృషి పాశ్చాత్య లోకానికి కంటక ప్రాయమవుతోంది. దురదృష్టవశాత్తు పాశ్చాత్యతా ప్రభావంలో ఉన్న వీరు ముస్లిముల ఈ ప్రయత్నాల

కారణంగా అనవసరంగానే భయాక్రాంతులయి నిస్పృహావస్థలో కొట్టుమిట్టాడుతున్నారు.

ఇలాంటి అత్యావసర సందర్భంలో మేము సమర్పిస్తూ ఉన్న ఈ పుస్తకం ఇస్లామీయ వ్యవస్థ అవగాహనకు, దాని క్రియాత్మక రూపకల్పనకు దోహదపడగలదని, ముస్లిం సోదరులకూ ముస్లిమేతర సోదరులకూ సమంగా ఉపయుక్త మవగలదని ఆశిస్తున్నాము.

ఎస్. ఎమ్. మలిక్
డైరెక్టర్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్

హైదరాబాద్
15-3-1989

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# 1

# జీవన దృక్పథం

ఇస్లామ్‌లోని ముఖ్యమయిన లక్షణం ఏమిటంటే అది ఆధ్యాత్మిక జీవితం మరియు ప్రాపంచిక జీవితం మధ్యన ఎలాంటి తారతమ్యాన్ని పాటించదు. ఇస్లామ్ లక్ష్య పరిధి సర్వతోముఖ మయింది. మనిషి వ్యక్తిగత జీవితాన్ని, సామాజిక వ్యవస్థను మొత్తాన్ని తీర్చిదిద్దాలని అది అభిలషిస్తుంది. అప్పుడే 'దేవుని రాజ్యము' నిజంగానే భువిలో స్థాపించడం సాధ్యమవుతుంది. అప్పుడే శాంతి, సంతృప్తి సౌభాగ్యాలతో ప్రపంచం అలరారడానికి వీలవుతుంది.

ఈ విధంగా ఇస్లామీయ జీవన విధానం ఓ విలక్షణమైన జీవన దృక్పథం, ఇది, ఈ విశ్వంలో మనిషి స్థానానికి సంబంధించిన ఓ ప్రత్యేకమయిన భావన ఆధారంగా రూపొందుతుంది. అందువల్ల ఇస్లాం ప్రతిపాదించే నైతిక, సామాజిక, రాజకీయ ఆర్థిక విధానాలను చర్చించే ముందు జీవితానికి సంబంధించిన ఈ ఇస్లామీయ దృక్పథం ఏమిటో క్షుణ్ణంగా తెలుసుకోవడం ఎంతో అవసరం.

# ప్రాథమిక అంశాలు

1. సర్వ సృష్టికర్త, స్వామి, పాలకుడు, విశ్వ ప్రభువు అయిన దైవం మానవుణ్ణి సృష్టించాడు; తన అనంతరాజ్యమయిన పుడమిపై అతనికి ఓ తాత్కాలిక నివాసాన్ని కల్పించాడు. మనిషికి ఆయన, ఆలోచించే, అర్థం చేసుకునే సామర్థ్యాన్ని ప్రసాదించాడు ; మంచి, చెడుల మధ్య విచక్షణ చెయ్యగల శక్తినీ అనుగ్రహించాడు ; తన చుట్టూ ఉన్న ప్రపంచంలోని సాధనా సంపత్తిని, వస్తువుల్ని తనకు ఇష్టమయిన రీతిలో వినియోగించుకునే సంకల్ప స్వేచ్ఛను, అధికారాన్నీ ఇచ్చాడు ; ఈ విధంగా మొత్తం మీద మనిషికి ఓ విధమయిన స్వయం ప్రతిపత్తి (Autonomy)ని ప్రదానం చేశాడు. దానితోపాటు దైవం అతన్ని భువిలో తన ప్రతినిధి(ఖలీఫా)గా కూడా నియమించాడు.

2. మానవుణ్ణి ఈ విధంగా తనప్రతినిధిగా నియమించక పూర్వమే అతడు తనతో ఎలాంటి సంబంధాలు కలిగి ఉండాలో అతి స్పష్టంగా తెలియజేశాడు విశ్వప్రభువు : "ఆయనే మనిషికీ ఈ విశ్వానికంతటికీ ప్రభువు, పరిపాలకుడు, ఆరాధ్యుడు. అందువల్ల ఈ జగత్తు అంతా ఇందులో ఉన్న (మనిషితోపాటు) సకల సృష్టి రాసులూ కేవలం ఆయనకే లొంగిపోవాలి, దాసోహమనాలి. దేవుని ఈ సామ్రాజ్యంలో మనిషి సర్వాధికారీ కాడు, ఈ భూమి ఇతని శాశ్వత నివాసమూ కాదు. మనిషిని ప్రపంచంలోకి పంపించింది కేవలం కొంతకాలం గడపడానికే. ఇది వాస్తవానికి ఒక పరీక్షా సమయం. ఆ నిర్ణీత కాలం తరువాత మనిషి మళ్ళీ తన ప్రభువు వద్దకే మరలిపోవలసి ఉంటుంది. అప్పుడు మనిషి కార్యకలాపాలను పరిశీలించి అతను ఈ పరీక్షా సమయాన్ని ఎలా

గడిపాడో నిర్ధారించి, పరీక్షలో ఎవరు నెగ్గారో, ఎవరు నెగ్గలేదో నిర్ణయిస్తాడు విశ్వప్రభువు. మనిషి అనుసరించవలసిన నిజవైఖరి ఏదంటే మనిషి దైవాన్నే ఏకైక ప్రభువుగా, పోషకుడుగా, ఆరాధ్యుడుగా స్వీకరించాలి. ఆయన అందజేసే మార్గదర్శకత్వాన్నీ ఆయన ఆదేశాలను తన జీవితంలో, తన ఆచరణలన్నింటిలో అనుసరించాలి. దైవం చెయ్యబోయే చివరి తీర్పులో ఆయన ఆమోదం పొందటమే మనిషి జీవిత పరమార్థం కావాలి.

"మనిషి దైవభక్తి, ఋజువర్తన వైఖరిని అవలంబిస్తే (ఆ విధంగా చేసే స్వేచ్ఛ అతనికి ఉంది) అతనికి ఇహలోకంలోనూ శాంతి, సంతృప్తి సంప్రాప్తమవుతాయి. పరలోకంలోనూ శాశ్వత సౌఖ్యం, చిరకాల ఆనందాల నిలయమయిన స్వర్గాన్ని పొందుతాడు. ఇది కాదని దైవ ధిక్కార దుర్వర్తన వైఖరిని అవలంబిస్తే (దాన్ని అవలంబించే స్వేచ్ఛ కూడా అతనికి ఉంది) మనిషి, ప్రపంచంలో అశాంతి,అరాచకాలను చవిచూడవలసి ఉంటుంది. పరలోకంలోనూ శాశ్వత దుఃఖం, అంతులేని ఆపదల అఖాతం అయిన నరకాన్ని ఎదుర్కోవలసి ఉంటుంది."

3. ఇలా విశదపరచి విశ్వప్రభువు మానవాళికి భువిలో నివాసమేర్పరిచాడు. మానవ జాతికి తొలి జంట అయిన ఆదమ్ హవ్వాలకు (అల్లాహ్ వారిపై శాంతిని వర్షింప జేయుగాక) వారూ వారి సంతతి ప్రపంచంలో ఏ విధంగా జీవించాలో మార్గ దర్శకత్వం కూడా అనుగ్రహించాడు. అంటే భువిలో మానవ జీవితం అజ్ఞానపు అంధకారంలో ప్రారంభం కాలేదు. ఆది నుండీ వారికి విజ్ఞానపు జ్యోతిని ప్రసాదించడం జరిగింది. తొలి మానవుడు స్వయంగా దైవం తరఫుననే మార్గ

దర్శకత్వం పొందాడు. వారు అనుసరించవలసిన సరయిన జీవిత విధానమూ వారికి తెలుపడం జరిగింది. అదే ఇస్లాం, విశ్వకర్త ఆజ్ఞాపాలన, ఆయన విధేయతామార్గం. ఆదమ్ హవ్వాలు తమ సంతానానికి ఈ దైవ విధేయతామార్గం, ఈ ధర్మం ఇస్లాంనే అందచేశారు.

కాని తరువాత వచ్చిన తరాలవారు క్రమక్రమంగా ఋజు మార్గానికి దూరమయిపొయ్యారు. వారు ఆ నిజ జీవితవిధానాన్ని ఆ అసలు బోధనల్ని తమ అలక్ష్యం కారణంగా కోల్పోయ్యారు ; లేదా అందులో దుర్బుద్ధితో మార్పులు చేర్పులు చేసి దాన్ని వికృతం చేశారు. భూనభాంతరాళాల్లోని విభిన్నమానవ, మానవేతర శక్తుల్ని, కాల్పనిక భౌతిక వస్తువుల్ని వారు అల్లాహ్‌కు సహవర్తులుగా ఎంచసాగారు, బహు దైవారాధన ప్రబలింది. దైవం ప్రసాదించిన 'వాస్తవికతా జ్ఞానం'లో రకరకాల మూఢ నమ్మకాలను, సిద్ధాంతాలను, తత్వాలనుకలిపి వారు అసంఖ్యాక మయిన మతాలను. తత్వాలను సృష్టించుకున్నారు. దైవం నిర్ణయించిన వ్యక్తిగత, సామాజిక నీతి సూత్రాలను వదలివేశారు.

4. మనిషి ఋజు మార్గానికి దూరమయినా, మత ధర్మాలను చెరిపి వేసినా, దైవ మార్గదర్శకత్వాన్ని త్రోసి పుచ్చినా అల్లాహ్ తన శక్తితో వారిని నిర్మూలించనూ లేదు, బలాత్కారంగా ఋజుమార్గంవైపుకు మళ్ళించనూ లేదు. ఎందుకంటే బలవంతపు నైతికతఅనేవి, ఆయన మానవునికి ప్రదానంచేసిన పరిమిత స్వేచ్ఛా ప్రతిపత్తికి వ్యతిరేక మవుతుంది. దానికి బదులుగా ఆయన మానవుల్లో నుంచే తనను విశ్వసించేవారిని, తన అభీష్టానికి అనుగుణంగా నడచుకునే వారిని మానవులకు సన్మార్గం

చూపే తన దౌత్య ప్రతినిధులుగా నియమించాడు; తన సందేశాలను వారి వద్దకు పంపాడు; వారికి శాస్త్రవికతా జ్ఞానాన్ని ప్రసాదించాడు; నిజమయిన జీవిత నియమాళిని అనుగ్రహించాడు. దైవ సందేశాన్ని మార్గదర్శకత్వాన్ని ప్రజల్లో వ్యాపింపజేసే బాధ్యతను ఆయన వారికి అప్పగించాడు.

5. ఈ దైవసందేశహరులు వేలసంఖ్యలో వివిధజాతుల్లో విభిన్న దేశాల్లో విభిన్న కాలాల్లో ప్రభవించారు. వారందరూ ఒకే సందేశాన్ని తీసుకు వచ్చారు. వారందరి ధర్మం ఒక్కటే; అంటే మానవుడికి ఆదిలోనే తెలుపబడిన ఋజుమార్గం అన్నమాట. వారందరి జీవిత ధ్యేయం కూడా ఒక్కటే—ఇస్లాం ధర్మం వైపుకు దైవానికి స్వయం సమర్పణ చేసుకునేందుకు తోటి మానవుల్ని ఆహ్వానించటం; ఈ సందేశాన్ని స్వీకరించినవారు స్వయంగా దానికనుగుణంగా జీవించేలా వారిని సంఘటిత పరచడం, దైవ శాసనాన్ని స్థాపించి, రుజు మార్గాన్ని ఉల్లంఘించే విధానాన్ని ప్రతిఘటించగలిగే ఒక ఉద్యమాన్ని వారి ద్వారా లేవనెత్తడం. కాని నిత్యం అత్యధిక ప్రజలు వారి సందేశాన్ని స్వీకరించటానికే ముందుకు రాలేదు. కొందరు దాన్ని స్వీకరించినా వారు కూడా క్రమేణ రుజుమార్గానికి దూరమయి భ్రష్టులయ్యారు.

6. చివరికి విశ్వ ప్రభువు అరేబియాలో ముహమ్మద్ (సఅసం)ను ఎంపిక చేశాడు. గతించిన ప్రవక్తలందరి ధ్యేయాన్ని నెరవేర్చడానికే ఈయన్నీ ప్రభవింపజేశాడు. మహనీయముహమ్మద్ (సఅసం) సందేశం యావత్తు మానవాళికై ఉద్దేశించబడింది. ఆయన సరికొత్తగా ఇస్లాం బోధనల్ని వాటి ప్రస్ఫుటమయిన రూపంలో అందజేశారు. మానవాళి కోల్పోయిన దైవ మార్గదర్శి

కత్వాన్ని తిరిగి బోధించారు. ఎవరయితే ఈ సందేశాన్నీ, మార్గదర్శకత్వాన్నీ స్వీకరించారో వారిని ఒక సమాజంగా రూపొందించారు. వారు, స్వయంగా తమ జీవిత వ్యవస్థను ఇస్లాం ఆదేశాలకనుగుణంగా నిర్మించుకుంటూ, ప్రజల్ని మంచి మార్గం వైపుకు పిలిచేవారుగా దైవవచనాన్ని ధరణిలో అత్యున్నతం చేసే 'అనుచర సంఘం'గా వారిని రూపొందించడం ఆయన కర్తవ్యం. ఈ సందేశం, ఈ మార్గదర్శకత్వం, ఈ ఆదేశాలు కల గ్రంథమే 'దివ్య ఖుర్ఆన్'.

## ఈమాన్—దాని స్వరూప స్వభావాలు

మానవునికి దైవంతో సంబంధం ఎలాంటిదో ; ఆ సంబంధం ఆధారంగా సహజంగానే ఎలాంటి జీవన దృక్పథం రూపొందుతుందో దాన్ని దివ్య ఖుర్ఆన్ అనేక చోట్ల ప్రస్తావిస్తుంది. అది ప్రతిపాదించే జీవన దృక్పథాన్ని దిగువ పేర్కొన్న ఆయత్‌లో సూత్రీకరించడం జరిగింది.

"యదార్థమేమిటంటే, అల్లాహ్ ముస్లిముల నుండి వారి ప్రాణాలను, వారి సంపదల్ని స్వర్గానికి ప్రతి మూల్యంగా కొనుక్కున్నాడు. కాగా వారు అల్లాహ్ మార్గంలో పోరాడుతారు, చంపుతారు, చస్తారు. వీరితో అల్లాహ్ చేసిన (స్వర్గం యొక్క) వాగ్దానం— తౌరాత్‌లోను, ఇంజీల్‌లోను మరియు ఖురాన్‌లోనూ పటిష్ఠమయింది. తన వాగ్దానాన్ని నెరవేర్చడంలో అల్లాహ్‌ను మించిన వాడెవడైనా ఉన్నాడా ? కనుక సంబరపడండి, మీరు దైవంతో చేసుకున్న బేరానికి ; ఇదే అన్నింటి కంటే మహత్తరమయిన సాఫల్యం." (అత్ తౌబా :111)

పై ఆయత్‌లో దైవం పట్ల ఈమాన్ (విశ్వాసం) ప్రకటించడం కారణంగా మనిషి మరియు దైవం మధ్యన ఏర్పడే సంబంధం యొక్క స్వరూపాన్ని బేరంగా పేర్కొనడం జరిగింది. దీని అర్థమేమిటంటే దైవం పట్ల ఈమాన్ అన్నది కేవలం ఓ అధి భౌతిక తత్వం, విశ్వాసం మాత్రమే కాదు, అదొక ఒప్పందం లాంటిది కూడా. దీని ప్రకారం మనిషి తన జీవితాన్ని, తన సంపదల్ని దైవానికి అమ్మివేస్తాడు ; దీనికి ప్రతిమూల్యంగా, దైవం మనిషికి మరణానంతరం స్వర్గం ప్రసాదించే వాగ్దానాన్ని అంగీకరిస్తాడు. అంటే దేవుడు మనిషి ధన ప్రాణాలను కొనుక్కుని మరణానంతర జీవితంలో స్వర్గ బహూకరణను ప్రతిమూల్యంగా చెల్లిస్తానని వాగ్దానం చేస్తాడన్నమాట. ఈ బేరం, ఈ వాగ్దానం చాలా ముఖ్యమయిన పరిణామాలకు, పర్యవసానాలకు దారి తీస్తుంది, అందువల్ల ఈ బేరం, ఈ వాగ్దానం ఏమిటో క్షుణ్ణంగా అర్థం చేసుకోవడం ఎంతో అవసరం.

యదార్థం ఏమిటంటే ఈ ప్రపంచంలో ఉన్న ప్రతి వస్తువూ అల్లాహ్‌దే. అలాంటప్పుడు మనిషి జీవితమయినా అతని ఆస్తిపాస్తులయినా, ఈ ప్రపంచంలోని ఓభాగమే కనుక, అవి కూడా దైవానికి చెందినవే. ఎందుకంటే వాటిని సృష్టించినదీ, ప్రతి వ్యక్తికీ వినియోగించుకునేందుకు వాటిని అనుగ్రహించినదీ ఆ దైవమే. ఈ దృక్కోణంతో చూస్తే అమ్మడం, కొనడం అన్న ప్రశ్నే ఉత్పన్నం కాదు. అన్నింటికీ నిజస్వామి దైవమే గనుక తనకు చెందిన దాన్ని ఆయన కొనే ప్రసక్తేలేదు. పోతే మనిషికి చెందినది కూడా ఏమీ లేదు కనుక అతను అమ్ముకునేదీ ఏదీ లేదు.

అయితే మానవునిలో ఒకటుంది. దాన్ని దేవుడు పూర్తిగా మనిషికే అప్పజెప్పాడు. అది మనిషికే చెందినది. అది అతని స్వేచ్ఛ (Free will). ఈ స్వేచ్ఛ ద్వారా మనిషి దైవ మార్గం అనుసరించడానికయినా, అనుసరించకపోవడానికైనా సంపూర్ణ స్వాతంత్ర్యం (Freedom of choice) కలిగి ఉన్నాడన్న మాట. మరో విధంగా చెప్పాలంటే మనిషికి ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభించినంతమాత్రాన అతను తన అధీనంలోని శక్తిసామర్థ్యాలకు, సాధనా సంపత్తికి 'నిజమయిన' స్వామీ కాడు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల వల్ల వాటిని తన ఇష్టంవచ్చిన విధంగా వాడుకునే హక్కు కూడా అతనికి ప్రాప్తం కాదు ; అయినప్పటికీ, ఈ స్వేచ్ఛ కారణంగా, అతను కోరితే తన ప్రభువుకు తాను నిర్వర్తించవలసిన ఏ విధులకూ తాను బాధ్యుడుకాడనీ భావించుకోవచ్చు ; తనపై మరే ఉన్నత అధికారి జోక్యమూ లేదని కూడా అతను అనుకోవచ్చు.

ఈ సందరర్భంలోనే 'బేరం' ప్రశ్న తలెత్తుతుంది. ఈ బేరానికి భావం ఏమిటి ? దైవం మనిషికి చెందినదేదో వస్తువును కొంటున్నాడని అర్థం మాత్రం కాదు. దాని నిజ స్వరూపం ఇది : యావత్తు సృష్టి దైవానికి చెందినదే— కాని ఆయన కొన్నింటిని మనిషికి ప్రసాదించాడు. మనిషి వాటిని దైవం తరపున అమానతుగా గ్రహించి వాడుకోవాలి. ఇప్పుడు దైవం కోరేదేమంటే మనిషి, ఇష్టపూర్వకంగా— ఈ అమానతులన్నీ దైవానికి చెందినవే అని గుర్తించాలి. ఇప్పుడు ఒక వ్యక్తి ఐచ్ఛికంగా, దైవాన్నే తిరస్కరించడానికి తనకు ఇవ్వబడిన స్వేచ్ఛను వదలుకుని దానికి బదులుగా దైవం సార్వభౌమత్వాన్ని గుర్తించాడంటే అతను తనకు దైవం ప్రసాదించిన స్వతంత్ర ప్రతిపత్తిని దైవానికి

అమ్మి వేశాడన్నమాట. ఈ అమ్మకానికి ప్రతిమూల్యంగా అతనికి దైవం ప్రసాదించే శాశ్వత సౌఖ్యాల స్వర్గాన్ని పొందే వాగ్దానం లభిస్తుంది. ఇలాంటి 'బేరం' చేసే వ్యక్తినే 'మోమిన్' లేక విశ్వసించిన వ్యక్తి అనంటారు. ఈబేరం లేక ఒప్పందానికే ఇస్లాంలో ఈమాన్ (విశ్వాసం) అని పేరు. అయితే ఎవరయితే ఇలాంటి ఒప్పందం గురించి తెలుసుకుని కూడా దీన్ని చెయ్యడానికి సమ్మతించరో అలాంటి వ్యక్తి, లేదా ఇలాంటి ఒప్పందం చేసుకున్న తరువాత దీనికి విరుద్ధంగా ఈ ఒప్పందాన్ని భగ్నం చేసే విధంగా, ప్రవర్తించే వ్యక్తి కాఫిర్ (తిరస్కారి) అని పిలువబడతాడు. ఈ ఒప్పందాన్ని దాటవెయ్యడానికి లేదా ఉల్లంఘించడానికి ప్రయత్నించే ఈ వైఖరినే కుఫ్ర్ (తిరస్కారం) అని అంటారు. ఇవీ ఈఒప్పందం యొక్క స్వరూప స్వభావాలు. దీనివివిధ కోణాలను, నిబంధనల్ని క్లుప్తంగా పరిశీలిద్దాము :

1. దేవుడు మనల్ని పరీక్షలో పెట్టాడు. అది రెండు విధాలుగా ముందుకు వస్తుంది:

(అ) ఆయన మనిషిని స్వేచ్ఛగా వదిలేశాడు. అయితే అదే సమయంలో ఆయన పరిశీలిస్తున్నాడు, మనిషి నిజాయితీపరునిగా, తన ప్రభువు పట్ల విశ్వాస పాత్రుడుగా నిభాయించుకుంటున్నాడా? లేక తన కర్త, తన స్వామికే ఎదురుతిరుగుతున్నాడా ? సభ్యతా సంస్కారాలు గల వానిగా వ్యవహరిస్తున్నాడా లేక షైతాన్ కూడా సిగ్గుపడేలా దానవుడయి ప్రవర్తిస్తున్నాడా ? అని.

(ఆ) మనిషి ఈ లోకంలో తన ధన ప్రాణాలను అర్పించి దాని ప్రతిఫలం, మరో లోకంలో ప్రాప్తమయ్యే వాగ్దా

నానికి సంతృప్తి చెందగలడా ? ఆ మేరకు దైవం పట్ల విశ్వాసం కలిగివుండటానికి మనిషి సిద్ధంగా ఉన్నాడా? అన్న విషయాన్ని దైవం పరీక్షించదలిచాడు.

2. ఈమాన్ (విశ్వాసం) అంటే కొన్ని నమ్మకాలను కలిగి ఉండటం అన్నది, ఎవరైతే ఈ నమ్మకాలు కలిగి ఉంటారో వారు విశ్వసించిన వారు (మోమిన్) అవుతారన్న విషయం ఇస్లామీయ శాసనాంగంలో ఓ సూత్రం. అలాంటి ఓ వ్యక్తిని అవిశ్వాసి అని అనడానికయినా అతన్ని ఉమ్మత్ (అనుచర సంఘం)లో నుండి వెలివెయ్యడానికయినా మరెవరికీ ఎలాంటి హక్కు లేదు—అతను తనవిశ్వాసాన్ని పరిత్యజించాడని విస్పష్టమయిన ఆధారం లభించినప్పుడు తప్ప. ఇది చట్టపరమయిన అంశం. కాని దైవం దృష్టిలో, మనిషి తన ఇష్టాన్ని, స్వేచ్ఛను అల్లాహ్ ఇష్టానికి పూర్తిగా అర్పణ చేసుకున్న సందర్భంలోనే అతని ఈమాన్ విలువయినది. ఇది ఆలోచన, ఆచరణలకు సంబంధించిన విషయం. మనోమయమయిన వ్యవహారం. ఇందులో మనిషి తన్ను తాను సంపూర్ణంగా అల్లాహ్‌కు సమర్పించుకుంటాడు. తన అధిక్యతకు సంబంధించిన తన దావాలన్నింటినీ వదలుకుంటాడు.

ఓ మనిషి కలిమాను పఠించి, ఒప్పందాన్ని స్వీకరిస్తాడు ; నమాజ్ చేస్తాడు ; ఇతర ఆరాధనల్నీ నిర్వహిస్తాడు, కాని అతను తన శారీరక మానసిక శక్తులకు, తనభౌతిక, నైతిక సాధనా సంపత్తికి తానే స్వామి అని, ఇష్టమయిన రీతిలో వాడుకోగల సత్తాగలవాడని తన అంతర్యంలో అధికార సౌధాలు నిర్మించుకుంటే అలాంటి వ్యక్తిని మనుషులు ఎంతగా మోమిన్(విశ్వాసి)గా పరిగణించినా అతను దైవందృష్టిలో అవిశ్వాసిగానే ఉండిపోతాడు.

ఎందుకంటే, అతను నిజానికి దైవంతో ఆ బేరానికి అసలు దిగనే లేదు. దివ్యఖుర్ఆన్ ప్రకారం ఆ బేరమే ఈమాన్ లేక విశ్వాసం యొక్క నిజసారం. మనిషి తన శక్తిసామర్థ్యాలను సాధనాసంపత్తిని దైవం తనకై నిర్ణయించిన బాటలో వినియోగించకపోతే, పైగా వీటిని దైవం నిషేధించిన వాటిని సాధించడానికి ఉపయోగించి నట్లయితే దానికి అర్థం ఏమిటి? అలాంటి వ్యక్తి తన ధనప్రాణా లను ఒప్పందం ప్రకారం అల్లాహ్‌కు అప్పగించనయినా లేదు లేదా అతను ఆ ఒప్పందాన్ని తన ప్రవర్తన ద్వారా భంగపరుస్తున్నాడు.

3. ఈమాన్ యొక్క ఈ లక్షణం ఇస్లామీయ జీవన విధానాన్ని ఇస్లామేతర జీవిత విధానాలకు వ్యతిరేకమయినదిగా నిలుపుతుంది. అల్లాహ్ పట్ల నిజమయిన విశ్వాసంగల ముస్లిం, తన జీవితమంతా అల్లాహ్ అభీష్టానికి కట్టుబడి ఉండేలా, దైవానికి విధేయతామయమయి, స్వయంసమర్పణామయమయి ఉండేలా రూపొందించుకుంటాడు. అతడు ఎన్నడూ తలబిరుసు తనంగా, విశృంఖలంగా తనకు తానే స్వామి అయినట్లుగా వ్యవహరించడు— ఏదో పొరపాటుగా తప్ప. ఆ పొరపాటు తెలిసి వచ్చిన క్షణమే అతను తన ప్రభువు వైపుకు మరలుతాడు. తన తప్పిదానికి క్షమాపణకై వేడుకుంటాడు.

అలాగే నిజమైన ముస్లిములతో ఏర్పడిన ఓ సముదాయం లేక సమాజం తమప్రభువు నిర్ణయించిన చట్టాన్ని ఎన్నటికీ అతి క్రమించజాలదు. దాని రాజకీయ విధానం, దాని ఆర్థిక నీతి, దాని సమాజ నిర్మాణం, దాని సంస్కృతి, దాని న్యాయ వ్యవస్థ, అంతర్జాతీయ వ్యూహరచన—అన్నీ దైవం ప్రసాదించిన మార్గ దర్శక నియమావళి కనుగుణంగా ఉండాలి. పొరపాటు వల్ల

ఏదయినా ప్రతికూల విషయంజరిగినా తెలుసుకోగానే వారు దాన్ని సరిదిద్దుకోవాలి.

తమ జీవిత వ్యవహారాల్లో దైవమార్గదర్శకత్వానికి ఏస్థానమూ లేదని భావించడం, సర్వ స్వతంత్రత, స్వేచ్ఛాభావం కలిగి ఉండటం, తమ భాగ్యవిధాతలు తామే అని భావించటం అవిశ్వాసుల పద్ధతి. ఇలాంటి విధానాన్ని ఎవరయితే అవలంబిస్తారో వారు ముస్లిముల మాదిరి పేర్లు పెట్టుకున్నప్పటికీ నిజానికి అవిశ్వాసుల బాటనే అనుసరిస్తున్నారన్నమాట.

4. దేవుని అభీష్టం ప్రకారం నడచుకోవడం మనిషివిధి. దాన్ని మనిషి మార్గదర్శకత్వం కొరకు దేవుడే స్వయంగా అవతరింపజేశాడు. "దేవుని అభీష్టాన్ని" మనిషి తనకు తానుగా నిర్ణయించుకోడానికి వీల్లేదు. దైవమే స్వయంగా దాన్ని ప్రస్ఫుటంగా ప్రకటించిన తరువాత అందులో ఎలాంటి అస్పష్టతకూ తావులేదు. అందువల్ల ఒక సమాజం దైవంతో చేసుకున్న ఒప్పందాన్ని నిజాయితీగా, నిలకడగా పాటించదలిస్తే, అది దాని మొత్తం జీవితాన్ని దైవ గ్రంథం ప్రకారం, దైవ ప్రవక్త (సఅసం) సంప్రదాయం (సున్నత్) ప్రకారం మలచుకోవలసిందే.

ఈ విషయాల పర్యావలోకనం వల్ల, ఆ బేరానికి ప్రతిమూల్యం, మరణానంతరజీవితంలో లభించేలా ఎందుకు వాయిదా వెయ్యడం జరిగిందో కూడా బోధపడుతుంది. 'స్వర్గం' అనేది బేరం చేసినట్లు కేవలం చెప్పుకున్నంత మాత్రాన ప్రాప్తమయ్యే బహుమానం కాదు. ఆ ఒప్పందాన్ని నిజాయితీగా అమలు జరిపిన మీదట లభించే బహుమానమే అది. ఒప్పందం చేసుకున్న వ్యక్తి యొక్క జీవన వైఖరి, ఒప్పందంలోని షరతులను పూర్తిగా

ప్రతిబింబించకపోతే అతను ఆ బహుమానానికి అర్హుడు కాలేడు. అంటే, బేరంలోని చివరి అంశం, బేరం చేసిన వ్యక్తి చివరి శ్వాసతోనే ముగియడం వల్ల సహేతుకంగా ఆ బహుమానం, అతని మరణానంతర జీవితంలోనే ఇవ్వవలసి ఉంటుంది.

పైనుదాహరించిన దివ్య ఖుర్ఆన్ వాక్యాన్ని (ఆయత్ని) దాని సందర్భాన్ని దృష్టిలో ఉంచుకుని అధ్యయనం చేస్తే మరో ముఖ్యమయిన విషయం ద్యోతకమవుతుంది.

ఆ ఆయత్కు ముందున్న ఆయత్లలో కొందరి ప్రస్తావన ఉంది. తాము విశ్వసించిన వారు (ఈమాన్గలవారు)గా వారు ప్రకటించుకున్నారు. దైవ దాస్య జీవితాన్ని గడుపుతామని ప్రమాణం చేశారు. కాని పరీక్షా ఘడియలు ఎదురవగానే వారు దానికి అర్హులు కారని నిరూపించుకున్నారు. కొందరు లక్ష్యసాధన అవసరాన్నే అలక్ష్యంచేసి అసలు ధ్యేయానికే ద్రోహంతలపెట్టారు. మరికొందరు తమ ధన ప్రాణాలను దైవమార్గంలో త్యాగం చెయ్యడానికే నిరాకరించారు. దివ్యఖుర్ఆన్ ఈ మనుషుల బండారం బయటపెట్టి, వారి చంచల చిత్తాన్ని విమర్శిస్తుంది. ఆ తరువాత ఈమాన్ (విశ్వాసం)అన్నది నిజానికి ఓ ఒప్పందం అని, దైవమూ మానవుని మధ్య ఓ విధమయిన ప్రమాణమని స్పష్టం చేస్తుంది. ఈమాన్ అన్నది కేవలం దైవం పట్ల విశ్వాసం కలిగి ఉండటంతో సరిపోదు. ఈమాన్ అంటే— దైవమే మన ప్రభువు, ఆయనే సార్వభౌమాధికారంగల స్వామి. ఆయనే మన పరిపాలకుడు, మనిషి జీవితంతోపాటు, మనిషి తన సొంతమని చెప్పుకునేవన్నీ ఆయనకే చెందుతాయి, ఈ కారణాలవల్ల మనిషి వినియోగించే సమస్తమూ దైవం అభీష్టంమేరకే, ఆయన మార్గదర్శకత్వం ప్రకా

రమే ఉపయోగించబడాలి—అనే యదార్థాన్ని అంగీకరించడమన్న మాట. ముస్లిం ఎవతయినా దీనికి భిన్నంగా ప్రవర్తిస్తే అతనికి తన ఈమాన్(విశ్వాసం) పట్ల చిత్తశుద్ధి లేదని అర్థం. ఎవరయితే తమ జీవితాలను, తమకుచెందిన సర్వస్వాన్ని నిజంగానే దైవానికి అమ్మివేశారో, మరెవరయితే తమ జీవిత రంగాలన్నిటిలో దేవుని ఆదేశాలను అనుసరిస్తారో వారే నిజమయిన విశ్వాసులు.

## జీవనపథం

ఇస్లాం ప్రకారం, మనిషి యొక్క వ్యక్తిగత సామూహిక జీవితం మొత్తం మనిషి సంబంధాన్ని దైవంతో ఏర్పరచి దాన్ని పటిష్టం చేసేందుకు నిర్దేశించబడిన కార్యక్రమమే. ఈ ధర్మానికి ప్రారంభాంశమయిన ఈమాన్ అనేది మనిషి బుద్ధి వివేకాలు ఈ సంబంధాన్ని అంగీకరించడాన్ని సూచిస్తుంది. ఇస్లాం అంటే జీవితపు సకల రంగాల్లోనూ దైవేచ్ఛకు మనిషి పూర్తిగా స్వయం సమర్పణ చేసుకోవడం, లొంగిపోవడం అన్నమాట. ఇస్లాం ప్రతిపాదించే జీవన ప్రవర్తనా నియమావళినే షరీఅత్* అని అంటారు.

---

* "ఈ ప్రవర్తనా నియమావళిని అనుసరించడమే అసలు మానవాళికి ఎంతో సముచితమయిన మరెంతో సమంజసమైన వైఖరి. దీని వల్ల మానవ జీవితంలో సమత్వం భాసిల్లగలదు. జీవితం సాఫీగా సాగిపోగలదు. మానవ జీవితానికి వ్యక్తిగత స్థాయిలోనూ సామూహిక స్థాయిలోనూ సక్రమంగా నడచుకోవడానికి అది ప్రమాణాలను కొలమానాలను నిర్ణయిస్తుంది. మనిషి జీవితంలో ఎదుర్కొనే ఎంతో చిన్న విషయంలోనైనా, అత్యంత గంభీరమయిన సమస్యలోనయినా

దీని ఆధారాలు దివ్యఖుర్ఆన్ మరియు ప్రవక్త (సఅసం) సంప్రదాయం లేక సున్నత్.

---

అది మార్గం చూపుతుంది. దైవగ్రంథం మరియు దైవప్రవక్త బోధించే జీవన తత్వాన్ని ఒకసారి సత్యస్వరూపమయిందని మనిషి స్వీకరించిన తరువాత, తనకు ఆచరణా స్వాతంత్ర్యం లభించిన రంగాల్లోనూ దైవ మార్గదర్శకత్వాన్ని అనుసరించకపోవడానికి మనిషికి ఏ మాత్రం అధికారం ఉండదు. నిజానికి ఈ మార్గం అనేక కారణాలవల్ల ఎంతో సహేతుకమయింది. ఒకటి, మన స్వేచ్ఛను ఆచరణలో పెట్టే మన శక్తిసామర్థ్యాలు, అవయవాలు దైవం అనుగ్రహించిన వరాలు. మనం స్వయం కృషితో సాధించినవి మాత్రం కావు. రెండు, దేన్నైనా కోరుకునే ఎన్నుకునే స్వేచ్ఛ మనకు ఉంది. అయితే స్వయంగా ఆ స్వేచ్ఛ మనకు మన కృషి వల్ల ప్రాప్తమయింది కాదు; అదీ దైవం ప్రసాదించిందే. మూడు, మనం మన స్వేచ్ఛాభిలాషను ఏ ఏ వస్తువులపై ప్రయోగిస్తామో అవన్నీ కేవలం దైవానికి చెందినవిమాత్రమే కాదు అవి ఆయనే సృష్టించినవి కూడా. నాలుగు, మనం మన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ఎక్కడయితే అమలు జరుపుతామో ఆప్రాంతం కూడా దైవానికి చెందినదే. అయిదు, మానవ జీవితం విశ్వవ్యవస్థతో సామరస్యం పొందాలంటే, ఒకే సార్వభౌమాధికారి– మానవ ఆచరణకు సంబంధించిన ఉభయ రంగాలకు— ప్రాకృతిసిద్ధమయిన, స్వచ్ఛందమైన లేదా నైతిక, భౌతిక రంగాలకుగాను— ఒకే శాసన మూలం ఉండాలన్నది అనివార్యం. ఈ రెంటిని (భౌతిక, నైతిక రంగాలను) వేరు చెయ్యడం వల్ల అది ఏ మాత్రం రాజీలేని సంఘర్షణకు దారితీస్తుంది. ఆ సంఘర్షణ కారణంగా వ్యక్తి మాత్రమే కాదు, సమాజం కూడా ఇంకా మొత్తం మానవ జాతే అంతంకాని ఆపదలకు, వినాశానికి గురి అవుతుంది." (మౌలానా మౌదూది — Islamic law and constitution, 1960, P. 49)

దైవం పంపిన అంతిమ గ్రంథం, అంతిమ ప్రవక్త నేడు మనకు 'సత్యం' లభించే సాధనాలు. ఎవరయితే దైవప్రవక్త, దైవగ్రంథం అందజేసిన సత్యతాభావనను నిజమయినదిగా అంగీకరిస్తారో వారు ముందుకు వచ్చి తమ ఇచ్ఛను దైవేచ్ఛ సమక్షంలో అర్పించుకోవడం వారి బాధ్యత. ఈ 'అర్పణ'కే 'ఇస్లాం' అని పేరు. నిజ జీవితంలో విశ్వాసాన్ని(ఈమాన్‌ను) అమలుజరపడమని దీన్నే అంటారు. ఇలా చేసే వారు, అంటే ఎవరయితే ఐచ్ఛికంగా దైవాన్ని తమ సార్వభౌమునిగా స్వీకరిస్తారో, ఆయన దైవికమయిన అభీష్టానికి తమ్ముతాము అర్పించుకుంటారో ఇంకా తమ జీవితాలను ఆయన ఆదేశాల కనుగుణంగా మలచుకోడానికి నిశ్చయించుకుంటారో వారే 'ముస్లిములు'.

దేవుని అభీష్టానికి తమ్ముతాము అర్పించుకున్న వ్యక్తులందరూ ఒక్క వర్గంగా ఏకమవుతారు. ఈ విధంగా ముస్లిం సమాజం ఉనికిలోకి వస్తుంది. ఇదొక సైద్ధాంతిక సమాజం. ఈ సమాజం, వర్ణం, వంశం, ప్రాంతం ఆధారంగా ఏర్పడే సమాజాలకు పూర్తిగా భిన్నమయిన సమాజం. ఈ సమాజం ఐచ్ఛికంగా చేసుకున్న ఎన్నికద్వారా రూపుదాల్చిన సమాజం. ఇది మానవులూ వారి సృష్టికర్త మధ్య జరిగిన ఒకానొక ఒప్పందం ఫలితంగా ఏర్పడిన సమాజం. ఎవరయితే ఈ ఒప్పందం పరిధిలోకి వస్తారో వారు దైవాన్ని తమ సార్వభౌమునిగా, ఆయన మార్గదర్శకత్వాన్ని అత్యున్నతమయింది, అన్నింటికీ అతీతమైందిగా, ఆయన ఆదేశాలను బేషరతుగా అనుసరించవలసిన శాసనాలుగా నిర్ణయించుకుంటారు. వారు ఎదురుప్రశ్న వేయకుండా, ఎలాంటి సంశయాలకు లోనవకుండా, ఆయన వేటినైతే మంచి అని, చెడు అని,

సవ్యమయినదని, అపసవ్యమయినదని, అనుమతించినదని, నిషిద్ధమయినదని నిర్ణయిస్తాడో, వాటిని కూడా స్వీకరించేందుకు నిశ్చయించుకుంటారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఇస్లామీయ సమాజం తన ఐచ్ఛిక చర్యలన్నింటినీ సర్వోపరిజ్ఞాని అయిన దైవం నిర్ణయించిన పరిధుల వరకు పరిమితం చేసుకుంటుంది. మరో విధంగా చెప్పాలంటే ముస్లిం సమాజంలో శాసననిర్మాణానికి ప్రాథమిక మూలం దేవుని అభీష్టమే కాని మనిషి ఇచ్ఛ కాదు.

అలాంటి ఒక సమాజం ఉనికిలోకి వచ్చినప్పుడు దైవ గ్రంథమూ దైవప్రవక్త దాని కోసం ఒక జీవన నియమావళిని ప్రతిపాదిస్తాయి. దాన్నే షరీఅత్ అనంటారు. ఈ సమాజం తాను చేసిన ఒప్పందాన్ని పురస్కరించుకుని ఆ 'షరీఅత్'కు కట్టుబడి ఉండవలసి ఉంటుంది. అందువల్ల నిజమయిన ముస్లిం సమాజం ఏదయినా ఉంటే అది ఇష్టపూర్వకంగా షరీఅత్‌ను కాదని మరో జీవనవిధానాన్ని అవలంబిస్తుందన్నది ఏ మాత్రం మింగుడు పడని విషయం. అది ఒక వేళ అలాచేసినట్లయితే యదార్థంగా అది దైవంతో చేసుకున్న ఒప్పందం భంగమైందని అర్థం. ఆ సమాజం మొత్తం ఇస్లామేతర సమాజంగా మారిపోయిందని భావం.

అయితే మనం ఒక విషయాన్ని బాగా గుర్తుంచుకోవాలి. మనిషి ప్రతిదినం చేసే చిన్న చిన్న అపరాధాలు వేరు. షరీఅత్‌కు వ్యతిరేకంగా ఇష్టపూర్వకంగా జరిపే తిరుగుబాటు వేరు. మొదటి చర్య ఒప్పందాన్ని భంగపరిచే పరిధిలోకి రాకపోవచ్చు కాని రెండవ చర్య మటుకు స్పష్టంగా ఒప్పందాన్ని భంగపరచడం తప్ప మరేమీ కాదు. ఇక్కడ స్పష్టంగా అర్థం చేసుకోవలసిన విషయం ఏమిటంటే, ఒక ఇస్లామీయ సమాజం బుద్ధిపూర్వకంగా

షరీఅత్‌ను స్వీకరించరాదని తీర్మానించుకుంటే, ఇంకా షరీఅత్‌ను ఖాతరు చెయ్యకుండా తాను సొంతంగా నిర్మించుకున్న నిబంధనావళినో లేక ఇతరుల నుండి అరువు తెచ్చుకున్న దాన్ని అనుసరించాలని నిర్ణయించుకుంటే అలాంటి సమాజం దైవంతో తాను చేసుకున్న ఒప్పందాన్ని భంగపరిచి, తాను ఇస్లామీయ సమాజం అని పిలిపించుకునే అర్హతను కోల్పోతుంది.

## లక్ష్యాలు–స్వరూప స్వభావాలు

షరీఅత్ యొక్క ప్రప్రథమ ప్రముఖ లక్ష్యం ఏమిటంటే అది మానవ జీవితాన్ని 'మారూఫాత్'—సదాచారాల ఆధారంగా నిర్మించాలని, 'మున్‌కరాత్'—దురాచారాల నుండి దాన్ని ప్రక్షాళన చెయ్యాలని కోరుకుంటుంది. 'మారూఫాత్' అన్న పదంలో మానవ అంతర్యం సదా వేటినయితే 'మంచి'వి గా భావిస్తూ వచ్చిందో ఆ సకల సదాచారాలు, సకల సద్గుణాలు వస్తాయి. దీనికి భిన్నంగా 'మున్‌కరాత్' అంటే మానవ నైజం నిత్యం వేటినయితే 'చెడు'గా ఖండిస్తూ వచ్చిందో ఆ అపరాధాలన్నీ, పాపాలన్నీ అందులో వస్తాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే మారూఫాత్ మానవ నైజానికి, దాని అవసరాలకు సామాన్యంగా సామరస్యం కలిగి ఉండే విషయాలన్నమాట. మున్‌కరాత్ అంటే దానికి విరుద్ధమయిన విషయమన్న మాట. షరీఅత్ ఈ మారూఫాత్ అంటే ఏమిటో, మున్‌కరాత్ అంటే ఏమిటో స్పష్టమయిన భావనను అందజేస్తుంది. అలాగే అది, మానవులు తమ వ్యక్తిగత సామూహిక ప్రవర్తనల్లో వాటికి కట్టుబడి ఉండవలసిన నియమాలుగా వాటిని సూచిస్తుంది.

షరీఅత్ కేవలం 'మంచి' 'చెడు'ల ఓ జాబితాను మనకు అందజెయ్యడంతో ఆగదు. అది జీవిత విధానాన్ని మొత్తాన్ని ఓ పథకంగా రూపొందిస్తుంది. అందులో మంచి అన్నది వృద్ధి చెందేలా చెడు అన్నది మానవ జీవితాన్ని కలుషితం చేసి నాశనం చెయ్యకుండా ఉండేలా చూస్తుంది.

ఈ ఆశయ సిద్ధి కోసం షరీఅత్ దాని పథకంలో, 'మంచి' యొక్క పెరుగుదలను ప్రోత్సహించే అన్ని అంశాలనూ చేర్చుకున్నది. అలాగే ఈ పెరుగుదలకు అడ్డుకాగల అవాంతరాలను నిర్మూలించే మార్గాలను కూడా ప్రతిపాదించింది. ఈ విధానం వల్ల మంచిని పెంచేందుకు,మంచిని ప్రేరేపించేందుకు కారణాలు, సాధనాలు కాగల మారూఫాత్‌ల మరో పరంపర ఉనికిలోకి వస్తుంది. అలాగే మారూఫాత్‌ల మరో రకం కూడా ఉంది. మంచికి అవరోధాలుగా పనిచేసే విషయాల పట్ల నిషేధాజ్ఞలు అందులో ఉంటాయి. అలాగే చెడును పెంచేందుకు, లేక ప్రేరేపించేందుకు దోహదపడే మున్‌కరాత్‌ల ఒక జాబితాకూడా ఉంది.

షరీఅత్ ఇస్లామీయ సమాజాన్ని మలిచే తీరు ప్రకారం, అందులో మంచికి, సదాచారానికి, సత్యానికి, జీవితపు అన్నిరంగాల్లోనూ సుస్థిరంగా పెరిగే అవకాశాలుంటాయి. అదే సమయంలో అది 'మంచి తనం' మార్గంలో వచ్చే అవాంతరాలన్నింటినీ దూరం చేస్తుంది. అలాగే అది సామాజిక వ్యవస్థలో చెడుల నిర్మూలనకు కృషి చేస్తుంది. దానిగ్గాను అది చెడును నిషేధిస్తుంది. చెడు పుట్టి పెరిగే కారణాలన్నింటినీ దూరం చేస్తుంది. సమాజంలో చెడు చొరబడే గంతలనన్నింటినీ మూస్తుంది. చెడు

జరిగితే దాన్ని నివారించేందుకు కఠిన విధానాలను అవలంబిస్తుంది.

## మారూఫాత్

షరీఅత్ మారూఫాత్‌లను మూడు రకాలుగా వర్గీకరిస్తుంది. (1) ఫర్జ్, వాజిబ్ (Mandatory, విధులు, ఆదేశకమయినవి) (2) మత్‌లూబ్ (Recommendatory, ప్రోత్సాహకమయినవి) (3) ముబాహ్ (Permissable అనుమతించబడినవి).

ఫర్జ్ మారూఫాత్‌లను అవలంబించడం ముస్లిం సమాజంపై తప్పనిసరి అయిన విధి. షరీఅత్ వీటి విషయంలో నిర్బంధపూర్వకమయిన ఆదేశాలనిచ్చింది. ముస్లిం సమాజం అవలంబించవలసినవి, ఆచరించవలసినవి ఫర్జ్ మారూఫాత్‌గా పరిగణించబడతాయి వీటిలో కొన్నింటినయితే అతి స్పష్టంగా, నేరుగా కోరడమయింది మరి కొన్నింటిని ప్రవక్త మహనీయుల (సఅసం) ప్రవచనాల ద్వారా పరిగ్రహించడమయింది. ఇవి కాక షరీఅత్ ప్రతిపాదించే జీవన వ్యవస్థలో కొన్నింటి వృద్ధి వికాసాలు జరిగేలా ప్రత్యేక ఏర్పాట్లు చెయ్యడం జరిగింది. మరికొన్నింటిని షరీఅత్ కేవలం సిఫారసు చెయ్యడంతో సరిపెట్టుకుంది— వాటిని అమలుజరిపే బాధ్యత సమాజం లేక అందులోని మంచిని ప్రేమించేవారికి వదలివేసింది.

ఇక మిగిలింది అనుమతించబడిన మారూఫాత్. నిజానికి 'షరీఅత్' వేటినయితే స్పష్టంగా నిషేధించలేదో అవన్నీ 'షరీఅత్'

ప్రకారం అనుమతించబడిన మారూఫాత్‌లే ('ముబాహాత్'). దాన్ని స్పష్టంగా అనుమతించడమో లేదా స్పష్టంగా మన ఇష్టానికి వదలడమో జరిగే అవసరం లేదు. ఈ కారణంగా ముబాహాత్ (అనుమతించబడిన మారూఫాత్) పరిధి ఎంతో విస్తృతమయిందిగా రూపొందుతుంది. పేరు పెట్టి నిషేధించినవి తప్ప ప్రపంచంలో సకల వస్తువులు షరీఅత్ ప్రకారం ముస్లిములకు అనుమతించబడినవవుతాయి. ఈ పరిధిలోనే మనకు స్వేచ్ఛ ఇవ్వడం జరిగింది. ఇందులోనే మనం మన ఇష్టానుసారం, మన పరిస్థితుల రీత్యా కాలానుగుణంగా మనకు సరిపోయే చట్టాలు, నియమాలు మనం చేసుకోవచ్చు. అయితే అదంతా 'షరీఅత్' యొక్క సాధారణ స్వరూప స్వభావాలకు లోబడి మాత్రమే జరగాలి.

## మున్‌కరాత్

'మున్‌కరాత్' (లేక ఇస్లాం ప్రకారం నిషిద్ధమయిన వస్తువులు) రెండు రకాలుగా వర్గీకరించబడ్డాయి. 'హరామ్' (పూర్తిగా నిషేధించబడినవి) మరియు 'మక్రూహ్' (కేవలం అవాంఛనీయమయినవి, అసహ్యమయినవి). 'హరామ్'గా నిర్ణయించబడినవాటికన్నింటికీ విధిగా పూర్తిగా దూరంగా ఉండాలని ముస్లిములకు స్పష్టమయిన ఆదేశాలు ఇవ్వబడ్డాయి. 'మక్రూహాత్' విషయంలో షరీఅత్ ఏదో ఒక రూపంలో తన అసహ్యాన్ని, అయిష్టాన్నీ, ఏ మేరకు గర్హించదగిందో ప్రత్యక్షంగానయినా, పరోక్షంగానయినా స్పష్టంగానే వ్యక్తపరుస్తుంది. ఉదాహరణకు

కొన్ని 'మకూ్రహాత్', 'హరామ్' దరిదాపులకు చేరి ఉంటాయి. మరికొన్ని 'ముబాహాత్'కు చేరువగా ఉంటాయి. నిషిద్ధమయిన వాటికీ అనుమతించబడిన వాటికీ మధ్యన అసహ్యామయినవాటి జాబితా కాస్త నిడివిగానే ఉందనవచ్చు. అయినప్పటికీ కొన్ని సందర్భాలలో 'మకూ్రహాత్'లను నివారించడానికి 'షరీఅత్' కొన్ని నిర్దిష్టమయిన చర్యలనూ ప్రతిపాదిస్తుంది. ఇతర సందర్భాల్లో ఆ విషయాన్ని ఆయా దేశ కాల పరిస్థితులకనుగుణంగా సమాజం లేక వ్యక్తి ఉచిత రీతిలో చర్యలు గైకొనేలా వదలివేస్తుంది షరీఅత్.

## కొన్ని ఇతర లక్షణాలు

మన వ్యక్తిగత సామూహిక జీవితాలను క్రమబద్ధం చేయడానికి షరీఅత్, నిర్దేశాలను ప్రతిపాదిస్తుంది. ఈ నిర్దేశాలు జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను స్పర్శిస్తాయి. మత సంబంధమయిన ఆచారాలు, వ్యక్తిగత ప్రవర్తన, నీతి, అలవాట్లు, కుటుంబ సంబంధాలు, సామాజిక ఆర్థిక వ్యవహారాలు, పరిపాలన, పౌరుల హక్కులూ, బాధ్యతలు, న్యాయ వ్యవస్థ, యుద్ధమూ శాంతి స్థాపనకు సంబంధించిన చట్టాలు, అంతర్జాతీయ సంబంధాలు— ఒక్క మాటలో చెప్పాలంటే మానవ జీవితానికి సంబంధించిన విభిన్న రంగాలన్నింటినీ అది ఆవరించి ఉంది. ఈ నిర్దేశాలు మంచిది ఏదో, చెడు ఏదో సూచిస్తాయి. ఏది ప్రయోజనకరం, లాభదాయకమో, మరేది హానికరం, నష్టదాయకమో తెలుపుతాయి. ఏ సదాచారాలను అలవరచుకోవాలో, ప్రోత్సహించాలో, ఏ దురాచారాలను అణచాలో, ఎదిరించాలో

నేర్పుతాయి. మన వైయక్తిక, సామూహిక ఆచరణకు స్వేచ్ఛా రంగం ఏదో, దాని పరిమితులేవో బోధపరుస్తాయి, ఇంతటి మహత్తర చలనశీలమయిన సామాజిక వ్యవస్థ స్థాపనకు ఏ మార్గాలు, సాధనాలు మనం అవలంబించవచ్చో ఏ విధానాలను మనం విడనాడాలో కూడా అవి బోధిస్తాయి. షరీఅత్ పరిపూర్ణ జీవన విధానం ; అంతటా మార్గం చూపే సామాజిక వ్యవస్థ.

షరీఅత్‌కు సంబంధించిన మరో ప్రముఖమయిన అంశం ఏమిటంటే, అది స్వతఃసిద్ధంగా పరిపూర్ణాంశం. ఇస్లాం ప్రతిపాదించే జీవన పథకం మొత్తాన ఒకే భావన ఆవహించి ఉంటుంది. అందువల్ల ఆ పథకాన్ని ఏకపక్షంగా ఎలాంటి విభజనకు గురిచేసినా అది తప్పని సరిగా ఇస్లామీయ వ్యవస్థ మౌలిక భావనకూ, చట్టానికీ రెంటికీ హాని చేకూర్చుతుంది. ఈ విధంగా దీన్ని మానవ శరీరంతో పోల్చవచ్చు. అది కూడా స్వతఃసిద్ధంగా పరిపూర్ణాంశం. మనిషి శరీరంలో నుంచి ఒక కాలిని పీకివేసి దాన్ని మనిషిలో ఆరో వంతు అనో లేక ఎనిమిదో వంతు అనో అనలేము కదా. ఎందువల్లనంటే సజీవ మానవ శరీరం నుండి వేరుపడ్డ తరువాత ఆ కాలు మానవ ధర్మాన్ని ఏ మాత్రం నిర్వహించజాలదు. లేదా దాన్ని మరో జంతువు శరీరంలో అతికించి ఆ జంతువు ఆ కాలికి సంబంధించినంతవరకు మానవ ధర్మాన్ని నిర్వర్తిస్తుందని కూడా ఆశించలేము. అదే విధంగా మానవ శరీరంలోని చెయ్యి, కన్ను, ముక్కు తదితర అంగాలు ఏ విధంగా ఉపయోగపడతాయి, ఎంత సామర్థ్యంగా పనిచేస్తాయి. ఎంత సొగసును చేకూర్చుతాయి అన్న విషయాన్ని, వాటిని

వేర్వేరు చేసి, సరిగ్గా అంచనా వెయ్యడం. సజీవ శరీరంలో వాటి స్థానం, ధర్మాన్ని పరిగణనలోకి తీసుకోకుండా సాధ్యపడదు.

'షరీఅత్' ప్రతిపాదించే జీవన పథకాన్ని గురించి కూడా ఇదే మాటను చెప్పవచ్చు. ఇస్లాం మొత్తం జీవన పథకానికి ప్రాముఖ్యాన్నిస్తుంది— అందులోంచి ఏ విభాగాన్ని లేక ఏ విభాగాలనూ వేరుచెయ్యడానికీ వీల్లేదు. పర్యవసానంగా, షరీఅత్లోని వేర్వేరు విభాగాలను పరస్పరం వేరుచేసి పరిశీలించడం ఏ మాత్రం సబబు కాదు. అలాగే ఏదయినా ఒక ప్రత్యేక విభాగాన్ని తీసుకుని దాన్ని మరో 'ఇజం'తో కలిపి అతుకువెయ్యడం కూడా భావ్యం కాదు. 'షరీఅత్' సాఫీగా పని చెయ్యగలగాలంటే, ఆ జీవన వ్యవస్థ మొత్తాన్నీ సంపూర్ణంగా ఆచరించవలసిందే.

# 2

# ఇస్లాం చూపే నైతిక విధానం

మనిషిలో ఉండే నైతిక స్పృహ సహజమయినది. ఈ స్పృహ కొన్ని గుణాలను ఇష్టపడుతుంది, ఇంకా కొన్ని గుణాలను ఇష్టపడదు. ఈ స్పృహ ప్రతి వ్యక్తిలోనూ వ్యక్తిగతంగా ఎక్కువగానో తక్కువగానో ఉండవచ్చుగాని మొత్తానికి మానవ చైతన్యం నైతికతకు సంబంధించిన కొన్ని గుణాలను సదా మంచివిగా మరికొన్నింటిని చెడ్డవిగా సమంగా ముద్ర వేస్తూ వచ్చింది.

సత్యం, న్యాయం, వాగ్దాన పాలనం, విశ్వసనీయతల్ని మానవత నిత్యం ప్రశంసనీయాలుగా భావించింది. అబద్ధాన్ని, అన్యాయాన్ని, వాగ్దానభంగాన్ని, ద్రోహాన్ని మానవాళి ఏ కాలంలోనూ ఇష్టపడటం జరగలేదు. సహానుభూతి, దయ, దాతృత్వం, విశాల హృదయాలను సదా ఆదరించడం జరిగింది. దానికి భిన్నంగా స్వార్థం, లోభత్వం, కఠిన హృదయత, సంకుచిత దృష్టిని గౌరవంగా చూసిన సందర్భాలు ఎక్కడా కానరావు. సహనం, స్థైర్యం, నిగ్రహం, సంయమనం, దృఢసంకల్పం,

శౌర్యం ఎల్లప్పుడూ శ్లాఘనీయమయిన లక్షణాలుగా పరిగణించబడ్డాయి. దీనికి విరుద్ధంగా తొందరపాటు, నిలకడలేమి, పోకిరితనం, పిరికితనం, అధైర్యంలాంటి లక్షణాలపై పొగడ్తల పూల వర్షం కురిపించడం అంటూ ఎప్పుడూ జరగలేదు. ఆత్మనిగ్రహం, ఆత్మాభిమానం, సభ్యతాసంస్కారాలు, కలివిడితనం మంచి గుణాలుగానే ఎల్లెడలా భావించబడ్డాయి. కాంక్షాదాస్యాన్ని, సంకుచిత హృదయతను, అసభ్యతను, కుసంస్కారాన్ని ఉత్తమ గుణాల పట్టికలో చేర్చడమన్నది ఎన్నడూ జరగలేదు. విధి నిర్వహణ, విశ్వసనీయత, కార్యదక్షత, బాధ్యతా భావాలను సదా గౌరవించడం జరిగింది. విధి నిర్వహణలో అలక్ష్యం చూపేవాడు, విశ్వాసఘాతకుడు, పనిదొంగ, బాధ్యతా రహితుల్ని ఎన్నడూ మంచివారుగా పరిగణించడం జరగలేదు.

ఇలాగే సామూహిక జీవితంలోనూ శ్రేష్ఠ గుణాలేవో, దుష్ట గుణాలేవో అన్న విషయంలో మానవాళి నిత్యం ఏకాభిప్రాయమే కలిగి ఉండింది. ఏ సమాజంలోనయితే క్రమశిక్షణ, సంఘీభావం, సహాయసహకారాల వాతావరణం, శ్రేయోభిలాష, సామూహిక న్యాయం, పరస్పర ప్రేమానురాగాలు, సామాజిక సమానతలుంటాయో అలాంటి సమాజాన్నే సదా ఆదరణీయంగా చూడటం జరిగింది. విభేదాలు, విచ్ఛిన్నత, క్రమశిక్షణా రాహిత్యం, అరాచకం, అనైక్యత, పరస్పర దురాలోచనలు, అన్యాయం, అసమానతల్ని సామూహిక జీవితానికి కావలసిన సద్గుణాలని ఎప్పుడూ భావించడం జరగలేదు. అలాగే సచ్ఛీలతలు దుశ్శీలతల విషయంలోనూ మానవాళి నిత్యం ఒకే అభిప్రాయం కలిగి ఉండింది. దొంగతనం, వ్యభిచారం, హత్య,

దోపిడి, మోసం, లంచంలాంటి గుణాలు ఎన్నడూ మంచి పనులుగా గుర్తింపు పొందలేదు. నోటి దురుసుతనం, మనస్సు నొప్పించడం, చాడీలు చెప్పడం, పరోక్ష నిందలు వెయ్యడం, ఈర్ష్యపడటం, అపనిందలు మోపడం, కలతలురేపడంలాంటివి ఏనాడూ శ్లాఘనీయమయినవిగా ఎవరూ భావించలేదు. వంచకులు, దురహంకారులు, ప్రదర్శనాబుద్ధి కలవారు, కపటులు, ద్వంద్వ స్వభావులు, మొండిఘటాలు, దురాశాపరులు ఏ కాలంలోనూ మంచివారుగా చెలామణి కాలేదు. దీనికి భిన్నంగా తల్లిదండ్రుల సేవ, బంధువులకు తోడ్పాటు, పొరుగువారితో సద్వర్తనం, మిత్రులతో సహచర్యం, బలహీనుల మద్దతు, అనాధలు, నిరాశ్రయులను ఆదుకోవడం, వ్యాధిగ్రస్తుల సుశ్రూష, బాధితుల సహాయం, సదా సదాచారాలుగా భావించబడ్డాయి. సౌశీల్యవంతులు, మధురభాషులు, మృదు స్వభావులు, సర్వుల శ్రేయోభిలాషుల్ని నిత్యం గౌరవప్రదంగా చూడటం జరిగింది. ఎవరయితే రుజువర్తనులో, ఎవరయతే శ్రేయప్రియులో, ఎవరినయితే ఏ విషయంలోనైనా విశ్వసించ వీలవుతుందో, ఎవరి అంతర్బాహ్యాలు సమంగా ఉంటాయో, ఎవరి చేతలు మాటలకనుగుణంగా ఉంటాయో, ఎవరయితే తమకు ప్రాప్తమయినదానిపై తుష్టులయి, ఇతరుల హక్కును నిర్వర్తించడానికి విశాల హృదయం కలిగి ఉంటారో, ఎవరయితే తామూ శాంతంగా ఉంటూ, ఇతరులకూ శాంతిని పంచిపెట్టగలరో, ఎవరిద్వారానయితే మంచిని గ్రహించే ఆశ ప్రతి ఒక్కరికీ ఏర్పడుతుందో, మరెవరిద్వారానయితే చెడు జరిగే అనుమానమయినా కలగదో అలాంటి వారినే మానవాళి తనలోని ఉత్తమవర్గంగా నిత్యం అభిప్రాయపడుతూ వచ్చింది.

దీనివల్ల తేలేదేమంటే మానవ నైతికత అన్నీ వాస్తవానికి విశ్వజనీనమయిన సత్యాలకు పేరు. అవి ప్రతి మనిషికీ, ప్రతి యుగంలో తెలిసిన విషయాలే. 'మంచి' అన్నది లేక 'చెడు' అన్నది ఏదయినా సరే ఎక్కడయినా నిగూఢమయి ఉన్న వస్తువులు కావు. వాటిని వెదికి తీయవలసిన పనీలేదు. అవి మానవాళికి అనాదిగా సుపరిచితమయిన విషయాలు. వాటి గుర్తింపు మానవ నైజంలోనే నిబిడీకృతమయి ఉంది. ఈ కారణంగా దివ్య ఖుర్‌ఆన్ దాని పరిభాషలో, మంచికి 'మారూఫ్' అని, చెడుకు 'మున్‌కర్' అని అంటుంది. అంటే మంచి అన్నది ప్రతి మనిషికీ 'మంచి'గా పరిచయమున్న విషయం అనీ, చెడు అన్నది ఎవ్వరికీ మంచిదిగా, సదాచారంగా పరిచయం లేనిది అని అర్థం. ఈ మానవ సహజ గుణాన్నే దివ్య ఖుర్‌అన్ మరో విధంగా కూడా వివరిస్తుంది.

"మానవ అంతర్యానికి మంచీ చెడుల జ్ఞానాన్ని, పరిచయాన్ని దేవుడు తన నిగూఢ దైవిక మార్గం ద్వారా తెలియపరిచాడు."

## విభేదాలెందుకు ?

ఇప్పుడు ఓ ప్రశ్న: నైతికంగా మంచి అన్నదీ, చెడు అన్నదీ మనిషికి సుపరిచితమయినవే అయితే, ప్రపంచం కొన్ని గుణాలు మంచివని, కొన్ని గుణాలు చెడ్డవని నిత్యం ఏకాభిప్రాయం కలిగి ఉండినట్లయితే ప్రపంచంలో ఈ విభిన్న నైతిక వ్యవస్థలు ఎలా నెలకొన్నాయి ? వీటిమధ్య తారతమ్యం ఏ కార

ణంగా ఏర్పడింది ? ఇస్లాం తనదంటూ ప్రత్యేకంగా ఓ నైతిక వ్యవస్థ కలిగివుందని అంటే దానికి హేతువు ఏమిటి ? ఇంకా నైతిక రంగంలో ఇస్లాం అనుగ్రహించిన ప్రత్యేక అంశాలేవి ? ఏ అంశాలను ఇస్లాంలోని విశిష్టమయిన అంశాలుగా పేర్కొన వీలవుతుంది ?

ఈ సమస్యను అర్థంచేసుకునే ప్రయత్నంలో భాగంగా మనం ప్రపంచంలోని విభిన్న నైతిక వ్యవస్థల్ని పరిశీలిద్దాము. వీటి మధ్య వ్యక్తమయ్యే మొట్టమొదటి విభేదం ఏమిటంటే ఈ నైతిక వ్యవస్థలన్నీ విభిన్న గుణగణాలను మానవ జీవితంలో సమగ్రంగా సమన్వయపరచడంలో తీవ్రంగా విభేదిస్తున్నాయి. విభిన్న గుణాల పరిధుల్ని నిర్ణయించడంలోనూ, వాటి స్థానాన్ని నిర్ధారించడంలోనూ, వాటి ఉపయోగాన్ని నిర్దేశించడంలోనూ వాటి మధ్య పరస్పర సంబంధాన్ని, సమన్వయాన్ని స్థాపించడంలోనూ ఈ వ్యవస్థలన్నీ ఎంతో భిన్నంగా ఉన్నాయి. ఇంకా కాస్త లోతుగా పరిశీలించి ఆ వ్యత్యాసానికి కారణాన్ని తెలుసుకుంటే అది కాస్తా ఇలా బయటపడుతుంది. వాస్తవానికి, నైతికతలోని మంచీ చెడుల ప్రమాణాన్ని నిర్ణయించడంలోను, మంచీ చెడుల జ్ఞానం ప్రాప్తమయ్యే మార్గాన్ని సూచించడంలోను వాటి మధ్య విభేదం ఉంది. అలాగే నైతిక నియమాల వెనక వాటిని అమలుజరిపించే శక్తి (**Sanction**) ఏది అన్న విషయంలోనూ వాటిమధ్య అభిప్రాయభేదముంది. మనిషిని ఆ నియమాలకు కట్టుబడి ఉండేలా చేసే ప్రేరక శక్తులేవి ? అన్నదీ వాటి మధ్య విభేదగ్రస్తమే. ఇంతకు ఈ విభేదాలకు కారణాలను మనం వెదికితే చివరికి వాస్తవం తేలుతుంది ; ఈ వ్యవస్థలన్నింటి

మార్గాలను వేర్వేరుగా చేసిన అసలు విషయమేమిటో బయట పడుతుంది. అదేమిటంటే, విశ్వభావన, విశ్వవ్యవస్థలో మనిషి స్థానం, మానవ జీవిత పరమార్థం— ఈ విషయాలన్నింటిలో వీటి మధ్య భేదాభిప్రాయముంది. ఈ విభేదమే వాటి అసలు సారాన్ని, వాటి నైజాన్ని, వాటి రూపాన్ని ఆమూలాగ్రంగా విభేదానికి గురిచేసింది.

మానవ జీవితంలో నిర్ణయాత్మకమయిన ప్రశ్నలు కొన్ని ఉన్నాయి. వాటి సమాధానాల ఆధారంగానే మానవ జీవన వ్యవస్థ రూపుదిద్దుకుంటుంది. ఆ ప్రశ్నలు ఇవి : ఈ విశ్వానికి దేవుడంటూ ఒకడున్నాడా? ఉంటే దేవుడు ఒక్కడా లేక అనేక దేవుళ్ళున్నారా? దైవత్వాన్ని అంగీకరిస్తే ఆ దేవుని గుణగణాలేవి? మనకూ దైవానికీగల సంబంధం ఎలాంటిది? ఆయన మన మార్గదర్శకత్వానికి కావలసిన ఏర్పాట్లు ఏమయినా చేశాడా? మేము ఆయన సమక్షంలో జవాబు చెప్పుకోవలసి ఉందా, లేదా? జవాబుదారీ ఉంటే ఏ విషయాన్ని గురించి జవాబు చెప్పుకోవాలి? మన జీవితానికి లక్ష్యమూ, ఫలితమూ ఏదయినా ఉందా? మనం ఏ పరమార్థాన్ని సాధించేందుకు కృషిచెయ్యాలి? ఈ ప్రశ్నలకు ఏ విధమయిన సమాధానాలు లభిస్తాయో వాటి ప్రకారమే జీవన వ్యవస్థ, ఆ వ్యవస్థకనుగుణంగానే నైతిక వ్యవస్థ రూపొందుతాయి.

స్వల్పమయిన ఈ వ్యవధిలో ప్రపంచంలోని విభిన్న జీవన వ్యవస్థల్ని పరిశీలించి వీటిలో ఏవేవి ఈ ప్రశ్నలకు ఏ ఏ సమాధానాలిచ్చాయో, ఆ సమాధానాల కారణంగా ఆ వ్యవస్థల స్వరూప స్వభావాలు, వాటి మార్గాల నిర్ణయంలో ఎలాంటి

ప్రభావం పడిందో చెప్పడం కాస్తకష్టమే. అందువల్ల నేను కేవలం ఇస్లాం గురించి చర్చించదలిచాను. అది ఈ ప్రశ్నలకు ఏ సమాధానాలను నిర్ణయిస్తుందో, ఆ కారణంగా ఎలాంటి ప్రత్యేకమయిన నైతిక వ్యవస్థ రూపొందుతుందో వివరించడానికి ప్రయత్నిస్తాను.

## జీవితం, నైతికత-ఇస్లాం దృక్పథం

ఇస్లాం ఇచ్చే సమాధానాలు ఇలా ఉంటాయి. ఈ విశ్వానికి స్వామి 'దేవుడు.' ఆ దేవుడు ఒక్కడే. ఆయనే దీన్ని సృష్టించాడు. ఆయనే దీనికి ఎలాంటి భాగస్వామ్యంలేని స్వామి, పాలకుడు, పోషకుడూను. ఆయన ఆజ్ఞాపాలన ఆధారంగానే ఈ విశ్వ వ్యవస్థ అంతా అనుక్షణం ముందుకు సాగుతోంది. ఆయన వివేచనాపరుడు, పరమ శక్తిమాన్యుడు, గోప్యమయ్యేదీ బహిర్గతమయ్యేదీ ప్రతిదీ తెలిసినవాడు, పరిశుద్ధుడు, పవిత్రుడు (అంటే ఎలాంటి లోపాలకు, కొరతలకు, తప్పిదాలకు, బలహీనతలకు అతీతుడు, మచ్చలేని పరిశుద్ధుడు) ఆయన దైవత్వం, ఎలాంటి పక్షపాతమో, దురభిమానమో, వక్రతయో లేకుండా స్థిత సరళ మార్గాన స్థాపితమయి ఉంది.

మనిషి ఆయనకు ఆజన్మ దాసుడు, తన 'కర్త'కు దాస్యం చెయ్యడం, ఆయన ఆజ్ఞల్ని పాలించడమే మనిషి కర్తవ్యం. మానవ జీవితం ఆసాంతం దైవదాస్యమయమవడం తప్ప మరో మార్గం మనిషికి సరయినది కాదు. దైవదాస్య విధానం ఏదయి ఉండాలో ప్రతిపాదించడం మనిషి పని కాదు. దాన్ని మనిషికి స్వామి అయిన దేవుడే నిర్ణయిస్తాడు. దేవుడు మనిషి మార్గ

దర్శకత్వానికిగాను తన సందేశహరుల్ని పంపాడు గ్రంథాలు అవతరింపజేశాడు. తన జీవన వ్యవస్థను ఆ మార్గదర్శక జ్యోతి ద్వారా గ్రహించడమే మనిషి విద్యుక్త ధర్మం.

మనిషి తన జీవితంలో చేసే పనులన్నింటికీ దైవం సమక్షంలో జవాబు చెప్పుకోవలసి ఉంది. జవాబు చెప్పుకోవడమన్నది ఈ ప్రపంచంలో కాదు, అది పరలోకంలో జరుగుతుంది. మనిషికి ప్రస్తుతం ప్రపంచంలో ప్రాప్తమైన జీవితం వాస్తవానికి పరీక్షా వ్యవధి. మనిషి ఇక్కడ జరిపే కృషి, ప్రయత్నాలన్నీ, పరలోక విచారణలో అతను తన ప్రభువు సన్నిధిన సాఫల్యం పొందే లక్ష్యానికే ఉద్దేశించబడి ఉండాలి. మనిషి అస్తిత్వం సంపూర్ణంగా ఈ పరీక్షకు లోనవుతుంది. ఇతని శక్తిసామర్థ్యాలన్నీ పరీక్షించబడతాయి. ఈ జగత్తులో మనిషి ఏ వస్తువును ఎదుర్కొనడం జరిగినా దాని పట్ల అతను ఎలా వ్యవహరించాడు? అన్న విషయాన్ని నిష్పక్షపాతంగా పరీక్షించడం జరుగుతుంది. ఈ విచారణ జరిపే శక్తి కూడా సామాన్యమయింది కాదు. ఆయన మనిషి చేసే పనులనే కాదు, అతని ఆలోచనలు, సంకల్పాలను సయితం రికార్డు చేసి పొందుపరిచాడు. ఎక్కడ? భూమిలోని ఒక్కొక్క రేణువు మొదలుకుని నీరు, గాలి అనేక విశ్వ తరంగాలే కాదు మనిషి మనో మస్తిష్కాలు, ఇంకా ఇతర అవయవాలన్నింటిపైనా ఆ రికార్డు భద్రంగా నమోదయి ఉంది.

# నైతికతకు లక్ష్యం

జీవితానికి సంబంధించిన మౌలిక ప్రశ్నలకు ఇస్లాం ఇచ్చే సమాధానాలివి. ఈ విశ్వ భావన, విశ్వంలో మనిషి స్థానానికి సంబంధించిన ఈ వివరణ వల్ల మనిషి తెలుసుకోవలసిన, అతని ఆచరణకూ, కృషికీ లక్ష్యం కావలసిన ఆ అత్యున్నతమయిన 'మేలు' అన్నది ఏమిటో నిర్ధారణ జరుగుతుంది. అదే 'దైవ ప్రసన్నత'. ఇస్లాం ప్రతిపాదించే నైతిక వ్యవస్థలో ఒక వైఖరిని పరిశీలించి అది మంచిదో చెడ్డదో అని నిర్ణయించేందుకు ఉపకరించే గీటురాయి ఇదే.

దీన్ని నిర్ధారించడం మూలాన నైతికతకు కేంద్ర బిందువు లభిస్తుంది. దాని చుట్టూత మనిషి నైతిక జీవితం మొత్తం తిరగాడుతుంది. గాలి కెరటాలు ఎటుబడితే అటు లాక్కెళ్ళడానికి, మానవ జీవితం చుక్కాని లేని నావలా ఏనాటికీ మారదు. ఈ గీటురాయి, ఈ ప్రమాణాన్ని నిర్ధారించడం ద్వారా ఓ ఆశయ కేంద్రం రూపొందుతుంది. దాని కనుగుణంగా జీవితంలో సకల నైతిక గుణాలకు లక్షణాలకు తగిన అవధులు, సమంజస స్థానాలు, సముచితమయిన ఆచరణా విధానాలు నిర్ణయమవుతాయి. దీనిద్వారా మనకు శాశ్వత నైతికపు విలువలు (Values) ప్రాప్తమవుతాయి. అవి మారే పరిస్థితులన్నింటిలోనూ నిలకడగా స్థిరంగా ఉండగలుగుతాయి.

మరో ముఖ్యమయిన మాట ఏమిటంటే దైవ ప్రసన్నతను జీవిత పరమార్థంగా పొందినందువల్ల నైతికతకు ఓ అత్యున్నత ఆధారం లభిస్తుంది. దీని కారణంగా నైతిక వికాసానికి అనంత

మయిన అవకాశాల ద్వారాలు తెరచుకుంటాయి. ఏ దశలోనూ స్వార్థ ప్రయోజనాల కాలుష్యం కలిసే ప్రమాదం ఉండదు.

నైతికతకు ప్రమాణాన్ని సూచించడంతోపాటు ఇస్లాం, ఈ విశ్వభావన, ఈ మనిషి స్థాన నిర్వచనం ద్వారా మనకు మరో మహోన్నత వరాన్ని ఇస్తుంది. అది నైతికతకు సంబంధించిన మంచి చెడుల్ని తెలుసుకునే జ్ఞానం— ఆ జ్ఞానానికి ఓ శాశ్వత మార్గం. ఇది మన నైతిక జ్ఞానాన్ని కేవలం మన బుద్ధి, కోరికలు అనుభవాలు, మానవ శాస్త్రాల ఆధారంగా రూపొందించు కునేందుకు మనల్ని వదలివెయ్యలేదు. ఎందుకంటే ఇవే ఆధా రాలయితే, ఇవన్నీ నిత్యం మారుతూ ఉండే విషయాలే గనక వీటి నిర్ణయాలూ మారుతుంటాయి. తదనుగుణంగా మన నైతికపు విలువలూ మారుతూ ఉండవలసి ఉంటుంది. వాటికి ఎలాంటి స్థిరత్వం అనేది ప్రాప్తమే కాదు. అందువల్లనే ఇస్లాం అందజేసే ప్రాతిపదికలు మహా వరాలు. ఇస్లాం మనకు నిర్దిష్ట మయిన మూలాధారాలనిస్తుంది— దైవ గ్రంథం, దైవ ప్రవక్త (సఅసం) సంప్రదాయం, వీటి ద్వారా మనకు అన్ని పరిస్థితు ల్లోనూ, అన్ని దేశ కాలాల్లోనూ నైతిక ప్రబోధాలు లభిస్తూ ఉంటాయి.

ఈ ప్రబోధాలు, మన కుటుంబ జీవితంలోని అత్యల్ప విషయం మొదలుకుని అంతర్జాతీయ రాజకీయాల గొప్ప గొప్ప సమస్యల వరకు జీవితపు అన్ని కోణాలలో, అన్ని రంగాలలో మనకు మార్గం చూపుతుంటాయి. వీటిలో జీవన వ్యవహారా లన్నింటిపై నైతిక సూత్రాల విస్తృత అనువర్తన (Widest

application)కు ప్రాతిపదికలున్నాయి. దీనివల్ల ఏ దశలోనూ మనకు మరో జ్ఞాన మార్గం ఆవశ్యకత ఏ మాత్రం కలగదు.

## నైతికత: సాధికార శక్తి

అలాగే ఇస్లాం ప్రతిపాదించే విశ్వభావనలోనూ, మానవ స్థాయి నిర్ధారణలోనూ నైతిక నియమాల వెనక అవసరమయిన అమలు జరిపించే శక్తి (Sanction) కూడా ఉంది. అది: దైవ భీతి, పరలోక విచారణకు సంబంధించిన భయం, భావిలో శాశ్వతంగా నష్టపడే ప్రమాదం. ఇస్లాం నిజానికి, వ్యక్తులయినా వర్గాలయినా నైతిక నియమాలకు కట్టుబడి జీవించేలా నిర్బంధించే శక్తిమంతమయిన ప్రజాభిప్రాయాన్ని సామూహిక జీవితంలో నిర్మించగోరుతుంది. అలాగే నైతిక నియమాలను అధికారం ద్వారా అమలుజరిపించే రాజకీయ వ్యవస్థను సయితం అది నిర్మించాలని అభిలషిస్తుంది. కాని నైతిక నియమాలను పాటించే విషయంలో దాని అసలు నమ్మకం బాహ్యంలోని ఈ ఒత్తిడులపై కాదు. మనిషిలోని అంతరంగంలోని ఒత్తిడిపైనే ఉంటుంది. ఆ అంతరంగపు ఒత్తిడి దైవం, పరలోకం పట్ల విశ్వాసాలపై ఆధారభూతమయి ఉంటుంది. నైతిక ఆదేశాలను జారీ చేసే ముందు ఇస్లాం మనిషి అంతర్యంలో ఈ విషయాలను ప్రతిష్ఠింపజేస్తుంది; 'అన్ని వేళలా, అన్ని చోట్లా నిన్ను కనిపెట్టి ఉన్న దైవంతోటే నీ వ్యవహారం. నీవు ప్రపంచం మొత్తానికి కళ్ళు మూయించగలవు కాని 'ఆయన' దృష్టి నుండి తప్పించుకోలేవు. మొత్తం ప్రపంచాన్ని వంచించగలవు కాని

ఆయన్ని మోసగించలేవు. ప్రపంచం మొత్తాన్నీ తప్పించుకో గలవు కాని ఆయన పట్టు నుండి తప్పించుకుని మరెక్కడికీ పోలేవు. ప్రపంచం కేవలం నీ బాహ్య ప్రదర్శనల్ని మాత్రమే చూస్తుంది. కాని ఆయన నీ అంతరంగంలో తేలియాడే ఆలోచనల్ని సంకల్పాలను సయితం పసిగడతాడు. స్వల్పమయిన ప్రాపంచిక జీవితంలో నీవు నీకు ఇష్టమయిన రీతిలో ఏమయినా చేసుకో, కాని ఓ రోజు నీవు చావవలసిందే, ఆయన న్యాయ స్థానంలో హాజరు కావలసిందే. అక్కడ వకీళ్ళు, లంచాలు, సిఫారసులు, అబద్ధపు సాక్ష్యాలు, వంచన, మోసం ఏదీ సాగదు. నీ భవిష్యత్తుకు సంబంధించిన నిష్పాక్షికమయిన తీర్పు కూడా జరిగి తీరుతుంది.' ఈ విశ్వాసాన్ని ప్రతిష్ఠించి నిజానికి ఇస్లాం, ప్రతి మానవ హృదయంలో ఓ పోలీసు స్టేషన్ని నెలకొలుపుతుంది, అది లోనుంచే నియమాలను పాటించేందుకు మనిషిపై ఒత్తిడి తీసుకువస్తుంది, బయటి ప్రపంచంలో ఆ ఆదేశాలను అమలుజరిపించే పోలీసు, న్యాయ వ్యవస్థ, జైలు వ్యవస్థ ఉన్నా లేకపోయినా లోని వ్యవస్థ మటుకు కట్టుదిట్టంగా పనిచేస్తూ ఉంటుంది. ఇస్లాం ప్రతిపాదించే నైతిక నియమాల వెనక అసలు శక్తి ఇదే. ఇదే ఆ నియమాలను అమలుజరుపుతుంది. ప్రజాభిప్రాయం, ప్రభుత్వ అధికార శక్తి దానికి తోడుగా ఉంటే ఇక చెప్పనవసరం లేదు, దివ్యంగా ఉంటుంది. లేకపోయినా కేవలం ఈ విశ్వాసమే ముస్లిం వ్యక్తుల్ని, ముస్లిం సమాజాన్ని సక్రమంగా ఉంచగలుగుతుంది. ఇంతకూ విశ్వాసం నిజంగానే హృదయాల్లో స్థానమేర్పరచుకుని ఉండాలి మరి.

# ప్రేరకాలు

ఇస్లాం చూపే ఈ విశ్వభావన మానవ భావన మనిషిని నైతిక నియమాలకనుగుణంగా ఆచరించడానికి పురికొలిపే ప్రేరక శక్తుల్ని కూడా అందజేస్తుంది. మనిషి దైవాన్ని తన దైవంగా ఆయన దాస్యాన్ని తన జీవన విధానంగా చేసుకోవడానికి, ఆయన ఇష్టమే తన జీవిత పరమార్థంగా నిర్ణయించుకోవడానికి అంగీకరించడమే గొప్ప ప్రేరక శక్తి. దైవాదేశాలని తనకు నమ్మకం కుదిరిన ఆదేశాలను పాటించడానికి ఈ ఒక్క ప్రేరకమే చాలు. దీనితోపాటు పరలోక విశ్వాసం మరో శక్తిమంతమయిన ప్రేరక శక్తి. ఆ విశ్వాసం ప్రకారం, ఏ వ్యక్తి అయితే దైవాదేశాలను పాటిస్తాడో అతనికి ప్రాపంచిక జీవితంలో ఎన్ని కష్టనష్టాలను, బాధల్ని భరించవలసివచ్చినా శాశ్వత జీవితంలో మహోజ్వలమయిన భవిష్యత్తు తప్పనిసరిగా ప్రాప్తమవుతుందన్న నమ్మకం ఏర్పడుతుంది. దీనికి భిన్నంగా ఎవరయితే ఇక్కడ దేవుని అవిధేయతకు పాల్పడి అంతమవుతాడో అతడు ప్రపంచపు మూన్నాళ్ళ ముచ్చటలో ఎన్ని సుఖాలు జుర్రుకున్నా పరలోకంలో శాశ్వత శిక్షను అనుభవించవలసి ఉంటుందన్న విశ్వాసమూ కలుగుతుంది మనిషికి. శాశ్వత సుఖం లభించే ఆశ శాశ్వత బాధ కలిగే భయం ఒకవేళ ఎవరి అంతర్యంలోనయినా తిష్ఠ వేసుకున్నాయంటే ఇక దానంతటి బలవత్తర ప్రేరక శక్తి మరొకటి కాజాలదు. ఈ ప్రేరక శక్తి మనిషిని, చెడు ఎంతో రుచికరమై లాభకరమయి ఎదురయినప్పుడు కూడా చెడు నుండి దూరంగా ఉంచగలుగుతుంది.

ఈ వివరాల వల్ల స్పష్టంగా తెలిసేదేమంటే ఇస్లాం తన దంటూ ఓ విశ్వ భావనను, మంచీ చెడుల ఓ ప్రమాణాన్ని కలిగి ఉంది. నైతికతా జ్ఞానానికిగాను ప్రత్యేక ఆధారాలు, ప్రత్యేకమయిన అమలుజరిపే శక్తి, ప్రత్యేక ప్రేరక శక్తి కూడా దానికి ఉన్నాయి. వీటిద్వారానే అది అందరికీ ప్రియమయిన సాధారణ నైతిక నియమాలను తన విలువల కనుగుణంగా క్రమ బద్ధం చేసి జీవితపు అన్ని విభాగాల్లోనూ జారీ చేస్తుంది. ఈ కారణంగా ఇస్లాం తనదంటూ పరిపూర్ణమయిన ప్రత్యేక నైతిక వ్యవస్థ కలిగి ఉందని అనడం ఎంతో సామంజస్యత ఉంది. ఈ వ్యవస్థకు సంబంధించిన ప్రత్యేకతలయితే అనేకమున్నాయి. కాని వాటిలో ప్రముఖమయినవి మూడు. అవి మానవాళికి ఇస్లాం ప్రదానం చేసిన గొప్ప వరాలని చెప్పవచ్చు.

## విలక్షణమయిన అంశాలు

మొదటి ప్రత్యేకత ఏమిటంటే, అది దైవప్రసన్నతను జీవిత పరమార్థంగా నిర్ణయించి నైతికతకై అత్యున్నతమయిన ప్రమాణాన్ని అందజేస్తుంది. తత్కారణంగా నైతిక సముద్ధరణకు గల అవకాశాలకు హద్దంటూ ఏదీ లేదు. జ్ఞానానికి ఒక మూలాన్ని నిర్ణయించి నైతికతకు స్థిరత్వాన్ని పటిష్టతను ప్రసా దిస్తుంది. వీటిలో ఇంకా వృద్ధికయితే అవకాశాలు మెండుగా ఉన్నాయి. కాని చంచలతకు, అనునిత్యం మార్పుకు మటుకు తావు లేదు. దైవ భీతి ద్వారా నైతికతకు అమలుజరిపే శక్తి నిస్తుంది. అది బాహ్యపరమయిన వత్తిడిలేకుండా మనిషి నైతి-

కతను పాటించేలా చేస్తుంది అలాగే దైవం మరియు పరలోక భావనల ద్వారా ప్రేరక శక్తిని అనుగ్రహిస్తుంది. మనిషి తనంతటతాను నైతిక నియమాలను ఆచరించేలా అతనిలో ఇష్టాన్ని సన్నద్ధతను జనింపజేస్తుంది.

రెండో ప్రత్యేకత ఏమిటంటే అది అనవసరంగా ఏదో నవ్యత కోసం వింతయిన నైతిక నియమాలను ప్రతిపాదించదు. అలాగే మానవాళి అంగీకరించిన సాధారణ నైతిక గుణగణాలలో కొన్నింటిని తగ్గించడానికో లేక పెంచడానికో ప్రయత్నించదు. అది 'మారూఫ్' అందరికీ ఆమోదమయిన నైతిక గుణాలనే ఎత్తి చూపుతుంది ; వాటిలో కొన్నింటిని మాత్రమే కాదు, అన్నింటినీ అది తన పరిధిలోకి తీసుకుంటుంది. ఆ తరువాత జీవితంలో సమతూకంతో, సముచితమయిన రీతిలో ప్రతిదానికి స్థాయి, స్థానం, ఉపయోగం ప్రతిపాదిస్తుంది. వాటి అన్వయింపుకు ఎంతో విస్తృతినిస్తుంది. వ్యక్తిగత శీలం, గృహ జీవనం, సామాజిక ప్రవర్తన, పౌర జీవితం, దేశ రాజకీయాలు, ఆర్థిక వ్యవహారాలు, మార్కెట్టు, బజారు, పాఠశాల, న్యాయస్థానం, పోలీసు వ్యవస్థ, సైనిక స్థావరం, యుద్ధ భూమి— మొత్తానికి జీవితంలోని ఏ కోణమూ నైతికత యొక్క సార్వజనీన ప్రభావానికి దూరం కాదు. ప్రతి చోట, ప్రతి జీవనరంగంలో అది నైతికతకే ఆధిపత్యాన్నిస్తుంది అది, జీవన వ్యవహారాలన్నీ మనోకాంక్షలు, స్వలాభాలు, తాత్కాలిక ప్రయోజనాల చేతుల మీదుగా కాకుండా నైతికత ఆధారంగా ముందుకు సాగాలని ప్రయత్నిస్తుంది.

మూడవ ప్రత్యేకత ఏమిటంటే 'మారూఫ్' (సార్వజనీనమయిన మంచి) ఆధారంగాను 'మున్కర్' (సార్వజనీనమయిన చెడు)ల నుండి దూరంగాను ఉండే ఓ జీవన వ్యవస్థను నెలకొల్పుకోవాలని అది మానవాళిని కోరుతుంది. మానవాళి అంతరాత్మ ఏ మంచి విషయాలనయితే సదా మంచివిగా పరిగణిస్తూ వచ్చిందో వాటిని స్థాపించడానికి, వాటిని పెంపొందించడానికి ఎల్లరూ ముందుకు రావాలని అది కోరుతుంది. ఇంకా ఏ చెడునయితే మానవాళి నిత్యం చెడుగా భావిస్తుందో వాటిని అణచివెయ్యడానికి, వాటిని నిర్మూలించడానికీ అది అందరికీ పిలుపునిస్తుంది. ఈ పిలుపుకు అనుకూలంగా ప్రతిస్పందించినవారినే ఏకం చేసి ఇస్లాం వారి ద్వారా ఓ సమాజాన్ని (ఉమ్మత్)ని తయారుచేసింది. దాని పేరే ముస్లిం సమాజం. వారిని ఉమ్మత్‌గా చెయ్యడంలోని ఒకే ఒక్క ఉద్దేశ్యం వారు, మారూఫ్‌ను చెలామణిలోకి తెచ్చి దాన్ని సుస్థిరపరచడానికి, మున్కర్‌ని అణచి దాన్ని నిర్మూలించడానికి సంఘటితంగా కృషి చెయ్యడం మాత్రమే. ఒకవేళ ఉమ్మత్ చేతుల మీదుగా మారూఫ్ అణగిపోతూ మున్కర్ సుస్థిరమవుతూ ఉంటే ఇది ఈ ఉమ్మత్‌కు ఆ తరువాత ప్రపంచానికి కూడా దుర్భరమయిన దౌర్భాగ్యపు పరిస్థితి అనే చెప్పవలసి ఉంటుంది.

# 3

# ఇస్లాం ప్రతిపాదించే రాజకీయ వ్యవస్థ - ముఖ్యాంశాలు

ఇస్లామ్ ప్రతిపాదించే రాజకీయ వ్యవస్థ మూడు సూత్రాల ఆధారంగా నిర్మించబడింది. దేవుని ఏకత్వం, దైవదౌత్యం, ఖిలాఫత్ లేక ప్రాతినిధ్యం, ఈ సూత్రాలను అర్థం చేసుకోకుండానే ఇస్లామీయ రాజకీయ వ్యవస్థను వివరంగా అర్థం చేసుకోవడం కష్టం. అందువల్ల మొదట వీటినే క్లుప్తంగా విశదీకరిస్తాను.

దేవుని ఏకత్వం లేక 'తౌహీద్' అర్థం ఏమిటంటే, దేవుడు ఈ ప్రపంచాన్ని ఇక్కడ నివసించే వాటన్నింటినీ సృష్టించినవాడు, పోషించేవాడు, స్వామి. ఇక్కడ ప్రభుత్వం, పరిపాలన ఆయనదే ఆదేశాలివ్వడానికి, నిషేధాలు విధించడానికి ఆయనకే హక్కు ఉంది. దాస్యం చెయ్యాలన్నా, విధేయత పాటించాలన్నా మరొకరి జోక్యం, సహవర్తనం లేకుండా ఆయనకే

చెయ్యాలి. ఆ హక్కు ఆయనకే చెల్లు. మన అస్తిత్వం, మన వ్యక్తిత్వం, మనం పనిచేసే, చేయించుకునే మన శారీరక పరికరాలు (అవయవాలు), శక్తులు, ప్రపంచంలో ఉనికిగల వాటిపై మనకున్న అధికారాలు, మనం అధికారాలు చెలాయించే ప్రపంచంలోని అగణ్యమయిన వస్తువులు— వీటిలో ఏదీ మనం సృష్టించనూ లేదు, మనం సంపాయించనూ లేదు. వీటిని మనకు ప్రసాదించడంలో దైవంతోపాటు మరెవరూ ఆయనకు సహవర్తులూ, తోడూ లేరు. అందువల్ల మన జీవన పరమార్థం నిర్ధారించడమయినా, మన శక్తుల ఉపయోగం, మన అధికారాల పరిధులు నిర్ణయించడమయినా మన పని కాదు ; ఈ విషయంలో జోక్యం చేసుకోడానికి ఇతరులకు హక్కు అంతకన్నా లేదు. ఇది కేవలం ఆ దైవం యొక్క బాధ్యత. ఆయనే మనల్ని ఈ హక్కులూ అధికారాలు ప్రసాదించి సృష్టించాడు. ప్రపంచంలోని అనేక వస్తువుల్ని మన ఉపయోగార్థం మన అధీనంలో ఇచ్చాడు.

'తౌహీద్' లేక దేవుని ఏకత్వపు ఈ భావన మానవ సర్వాధిపత్యాన్ని సర్వాధికారాన్ని ఆసాంతం తిరస్కరిస్తుంది. ఒక వ్యక్తి అయినా, ఒక వంశమయినా, ఒక వర్గమయినా, ఒక జాతి అయినా లేదా సామూహికంగా ప్రపంచంలోని మానవులందరయినా సరే—అధిపత్యం, అధికారం చెలాయించే హక్కు ఎవ్వరికీ ఏ మాత్రం లేదు. సర్వాధికారి కేవలం దైవమే. ఆయన ఆదేశమే చట్టం.

దేవుని చట్టం ఏ మార్గం ద్వారానయితే మనిషి వరకు అందజెయ్యబడుతుందో దాన్నే రిసాలత్ లేక దైవ దౌత్యం అనం

టారు. దీని ద్వారా మనకు రెండు విషయాలు లభిస్తాయి. ఒకటి గ్రంథం. అందులో స్వయంగా దేవుడే తన చట్టాలను వివరించాడు. రెండవది, దేవుని ప్రతినిధిగా ప్రవక్త తన మాటల ద్వారా చేతల ద్వారా అందజేసే దైవ గ్రంథం యొక్క నిర్ధారిత విశదీకరణ. దేవుడు తన గ్రంథంలో మానవుని జీవన వ్యవస్థ ఏ సూత్రాల ఆధారంగా నెలకొనడం అవసరమో అవన్నీ వివరించాడు. ఆయన సందేశహరుడు ఆ గ్రంథం ఉద్దేశించిన విధంగా ఆచరణాత్మకంగా ఒక జీవన వ్యవస్థను నిర్మించి, దాన్ని అమలు జరిపి, దాని అవసరమయిన వివరాలు మనకు చూపి, మన కొరకు ఒక ఆదర్శాన్ని నిలిపారు. ఈ రెండు విషయాల సంచయనాన్నే ఇస్లామీయ పరిభాషలో 'షరీఅత్' అనంటారు. ఈ షరీఅతే ఇస్లామీయ రాజ్య స్థాపనకు ఆధారభూతమయిన మౌలిక రాజ్య నిబంధనావళి.

ఇక 'ఖిలాఫత్' లేక ప్రాతినిధ్యపు భావనను తీసుకోండి. అరబీ భాషలో ఈ పదం ఒక వ్యక్తి తరఫున మరొకరు పని చెయ్యడాన్ని సూచిస్తుంది. ఇస్లామీయ దృక్పథం ప్రకారం ప్రపంచంలో మనిషి స్థానం ఏమిటంటే అతను భువిపై దేవుని ప్రతినిధి. అంటే ఆయన స్వామ్యం గల ఈ ఆస్తిలో ఆయన ఇచ్చిన అధికారాలను మనిషి వినియోగిస్తాడని అర్థం. మీరు మీ ఆస్తి వ్యవహారాలు చూడటానికి ఎవరినయినా నియమించి నప్పుడు మీ దృష్టిలో తప్పని సరిగా నాలుగు విషయాలుంటాయి. ఒకటేమిటంటే ఆస్తికి అసలు స్వామ్యం గలవారు స్వయంగా మీరే గాని ఆ వ్యక్తి కాదు. రెండు, మీ ఆస్తి విషయంలో ఆ వ్యక్తి మీ ఆదేశాల కనుగుణంగా వ్యవహరించాలి. మూడు, అతను

తన అధికారాలను మీరు నిర్ణయించినపరిధుల్లో వినియోగించాలి. నాలుగు, మీ ఆస్తిలో అతను మీ ఉద్దేశాలను నెరవేర్చాలి గాని తన ఉద్దేశాలను కాదు. ఈ నాలుగు షరతులు ప్రాతినిధ్యపు భావనలో వాటంతటఅవే అంతర్లీనమయి ఉన్నాయి. ఏ ప్రతినిధి అయినా ఈ నాలుగు షరతుల్ని నెరవేర్చకపోతే అతను ప్రాతినిధ్యపు హద్దుల్ని అతిక్రమించాడని, ప్రాతినిధ్యపుభావంలో ఇమిడి ఉన్న ఆ అసలు ఒప్పందాన్నే అతను భంగపరచాడని మీరంటారు సరిగ్గా ఈ భావంలోనే ఇస్లాం మనిషిని దేవుని ప్రతినిధిగా పరిగణిస్తుంది. ఈ ప్రాతినిధ్యపు భావనలో ఈ నాలుగు షరతులూ చేరి ఉన్నాయి. ఈ రాజకీయ దృక్పథం ప్రకారం స్థాపించబడే రాజ్యం వాస్తవానికి దేవుని ఆధిపత్యానికి లోబడి మానవ ప్రాతినిధ్యపరిపాలన అనబడుతుంది. అందులో దేవుని భూమిపై ఆయన ఆదేశాల కనుగుణంగా ఆయన నిర్ణయించిన పరిధులలో వ్యవహరిస్తూ ఆయన అభీష్టాన్ని నెరవేర్చవలసి ఉంటుంది.

## ప్రజాస్వామ్యం

'ఖిలాఫత్' యొక్క ఈ నిర్వచనం విషయంలో మరో మాటను కూడా అర్థం చేసుకోవాలి. ఈ నిర్వచనం ప్రకారం ఇస్లామీయ రాజకీయ సిద్ధాంతం, ఏ ఒక్క వ్యక్తినో, లేక ఏ వంశాన్నో, లేక ఏ వర్గాన్నో ఖలీఫాగా నిర్ణయించదు. దానికి బదులుగా అది, దేవుని ఏకత్వం, దైవ దౌత్యపు మౌలిక సూత్రాలను అంగీకరించి ప్రాతినిధ్యపు నిబంధనల్ని నెరవేర్చేందుకు సిద్ధంగా ఉన్న సమాజం మొత్తానికి ఖిలాఫత్ బాధ్యతల నప్పగిస్తుంది. ఇలాంటి

సమాజం మొత్తం సామూహిక స్థాయిలో 'ఖిలాఫత్' బాధ్యతను, అధికారాలను కలిగి ఉంటుంది. ఈ ఖిలాఫత్ ఆ సమాజంలోని ప్రతి వ్యక్తికీ లభిస్తుంది. ఈ స్థాయిలోనే ఇస్లాంలో 'ప్రజాస్వామ్యం' ప్రారంభమవుతుంది. ఇస్లామీయ సమాజంలోని ప్రతి వ్యక్తి ఖిలాఫత్ అధికారాలూ హక్కులూ కలిగి ఉంటాడు. ఈ అధికారాల్లో, హక్కుల్లో వ్యక్తులందరూ సమానంగా భాగస్వాములు. ఎవరికీ ఎవరిపైనా ఎలాంటి ఆధిక్యత లేదు.. ఎవరికయినా ఈ అధికారాలూ హక్కులు దక్కకుండా చేసే హక్కు మరెవరికీ లేదు. రాజ్య పరిపాలనకై నెలకొలిపే ప్రభుత్వం ఈ వ్యక్తుల అభీష్టం మేరకే నిర్మించబడుతుంది. ఈ వ్యక్తులే తమ ఖిలాఫత్ అధికారాల ఓ భాగాన్ని పరిపాలకులకు అప్పగిస్తారు. ప్రభుత్వ నిర్మాణం ఈ ప్రజల అభీష్టం మేరకే జరుగుతుంది. అది ప్రజల సలహా సంప్రదింపులతోనే నిర్వహించబడుతుంది. ప్రజా విశ్వాసాన్ని పొందిన వారు ఖిలాఫత్ బాధ్యతల్ని నిర్వహిస్తారు. ఎవరయితే ప్రజల విశ్వాసాన్ని కోల్పోతారో వారు పరిపాలనా బాధ్యతల నుండి తొలగ వలసి ఉంటుంది.

ఈ విధంగా ఇస్లామీయ ప్రజాస్వామ్యం, ఓ ప్రజాస్వామిక వ్యవస్థ ఏ మేరకు పరిపూర్ణ ప్రజాస్వామ్యాన్ని కలిగి ఉంటుందో ఆ మేరకు అది పరిపూర్ణమయిన ప్రజాస్వామిక వ్యవస్థ కాగలదు. అయితే పాశ్చాత్య ప్రజాస్వామ్యానికీ ఇస్లామీయ ప్రజాస్వామ్యానికీ గల వ్యత్యాసం ఏమిటంటే పాశ్చాత్య రాజకీయ సిద్ధాంతం 'ప్రజా సార్వభౌమాధికారా'న్ని బలపరుస్తుంది; ఇస్లాం ప్రజా ప్రాతినిధ్యాన్ని (ఖిలాఫత్)ని ప్రతిపాదిస్తుంది. అక్కడ ప్రజలే 'రాజులు' ఇక్కడ 'రాజరికం' దైవానికే పరిమితం, ప్రజలు

ఆయనకు ప్రతినిధులు. అక్కడ ప్రజలు తమ షరీఅత్ (శాసనాంగాన్ని) తామే నిర్మించుకుంటారు. ఇక్కడ ప్రజలు, దైవం తన ప్రవక్త (సఅసం) ద్వారా అందజేసిన షరీఅత్‌ని పాటించవలసి ఉంటుంది. అక్కడి ప్రభుత్వం-ప్రజాభీష్టాన్ని నెరవేర్చడమే దాని కర్తవ్యం. ఇక్కడ ప్రభుత్వమూ, దాని నిర్మాతలయిన ప్రజలూ అందరూ దేవుని అభీష్టం నెరవేర్చడమే వారి కర్తవ్యం. క్లుప్తంగా చెప్పాలంటే పాశ్చాత్య ప్రజాస్వామ్యం నిరంకుశ దైవత్వం. అది తన అధికారాలను స్వేచ్ఛగా వినియోగిస్తుంది. దీనికి పూర్తిగా భిన్నమయిన రీతిలో ఇస్లామీయ ప్రజాస్వామ్యం దైవదాస్య నియమానికి కట్టుబడి ఉంటుంది. అదితన అధికారాలను దైవం ప్రసాదించిన ప్రబోధాల కనుగుణంగా, ఆయన నిర్ణయించిన హద్దుల లోపున వినియోగిస్తుంది.

ఇప్పుడు ఇస్లామీయ రాజ్యం ఎలా ఉంటుందో క్లుప్తంగానే అయినా స్పష్టంగా చిత్రించి చూపుతాను. దేవుని ఏకత్వం (తౌహీద్), ఆయన దౌత్యం (రిసాలత్), ఆయన ప్రాతినిధ్యం (ఖిలాఫత్) ఆధారంగా నిర్మించబడే ప్రభుత్వం ఈ విధంగా రూపుదిద్దుకుంటుంది:

## ఇస్లామీయ రాజ్య లక్ష్యాలు

ఈ రాజ్యం యొక్క లక్ష్యాన్ని దివ్యఖుర్‌ఆన్‌లో స్పష్టంగా సూచించడం జరిగింది. దాని ప్రకారం, విశ్వప్రభువు జీవితంలో ఏ మంచి పనులయితే పరిఢవిల్లడం ఇష్టపడతాడో రాజ్యంవాటిని స్థాపించాలి, పెంపొందించాలి, వృద్ధిపరచాలి. మరే చెడుల

ఉనికి జీవితంలో చోటుచేసుకోవడం విశ్వప్రభువుకు ఇష్టం లేదో వాటిని నిరోధించాలి, అణచివెయ్యాలి, రూపుమాపాలి. ఇస్లాం దృష్టిలో రాజ్య లక్ష్యం కేవలం దేశ పరిపాలన మాత్రమే కాదు, ఒక జాతి సామూహిక ఆశలు, ఆశయాలను, అభిలాషలను నెర వేర్చడం కూడా కాదు. దీనికి బదులుగా ఇస్లాం, రాజ్యానికి ఓ ఉన్నతమయిన ధ్యేయాన్ని ప్రతిపాదిస్తుంది. దీన్ని సాధించ డానికి అది దాని సాధనా సంపత్తినంతటినీ, శక్తిసామర్థ్యాల నన్నింటినీ వినియోగించాలి. ఆ ధ్యేయం ఏమిటి? దేవుడు తన భూమిపై, తన దాసులయిన మానవుల జీవితంలో ఏ పవి త్రత, ఏ శ్రేష్ఠత, ఏ మంచితనం, ఏ సంస్కారం, ఏ ప్రగతీ శ్రేయాలు చూడదలిచాడో అవి ఆవిర్భవించాలన్నది. ఇంకా దైవం దృష్టిలో ఈ భూమిని సర్వనాశనంచేసేవి, ఆయన దాసుల జీవితాన్ని విచ్ఛిన్నం చేసేవి ఎన్ని చెడు విషయాలున్నాయో వాటన్నింటికీ అడ్డుకట్ట నిర్మాణ మవ్వాలన్నదీను.

ఈ ధ్యేయాన్ని ప్రతిపాదించడంతోపాటు ఇస్లాం మన ముందు మంచీ చెడులకు సంబంధించిన స్పష్టమయిన భావనను సమర్పిస్తుంది. అందులో అభిలషనీయమయిన మేళ్ళు, గర్హ నీయమయిన కీడులు ప్రస్ఫుటంగా వ్యక్తీకరించి ఉంటాయి. ఈ భావనను దృష్టిలో ఉంచుకుని, ఏ కాలంలోనయినా, ఏ వాతా వరణంలోనయినా ఇస్లామీయ రాజ్యం తన సంస్కరణా కార్య క్రమాన్ని అమలు జరపగలదు.

ఇస్లాం సదా కోరేదేమంటే ప్రతి జీవన రంగంలోనూ నైతిక సూత్రాల పాటింపు జరుగుతూ ఉండాలి. అందువల్ల అది, తన రాజ్యంలోనూ ఖచ్చితమయిన ఒక పాలసీని, విధానాన్ని నిర్ణయి

ష్తుంది. దాని ప్రకారం ఇస్లామీయ రాజ్యం, నిష్పక్షపాతమయిన న్యాయం, నిస్వార్థమయిన సత్యం, ముక్కుకు సూటిగా పొయ్యే నిజాయితీ ఆధారంగానే ఏర్పడాలి. అది, దేశ ప్రయోజనాల దృష్ట్యా, పరిపాలనా సౌలభ్యాల కోసం, జాతీయ లాభాల కొరకు ఎలాంటి పరిస్థితుల్లోనూ అబద్ధం పలకడానికి, వంచనా శిల్పానికి, అన్యాయాలకు ఒడిగట్టదు. దేశంలో పరిపాలన ప్రజల మధ్య సంబంధాలయినా దేశం వెలుపల ఇతర జాతులతో ఏర్పడే సంబంధాలయినా, ఉభయత్రా అది సత్యతకు, విశ్వసనీయతకు, న్యాయానికి, అన్ని లక్ష్యాలపై ప్రాధాన్యతనివ్వాలని కోరుతుంది.

ముస్లిమ్ వ్యక్తుల మాదిరిగానే ముస్లిం రాజ్యం కూడా కొన్ని నిబంధనల్ని పాటించాలని అది కోరుతుంది. వాగ్దానం చేస్తే దాన్ని నెరవేర్చాలి. ఇచ్చే తూనికలు, పుచ్చుకునే కొలమానాలు సమంగా ఉండాలి. చెప్పే దాన్ని ఆచరించాలి ; చేసే దాన్నే ప్రకటించాలి. హక్కుతో పాటు బాధ్యతను కూడా జ్ఞాపకం పెట్టుకోవాలి. ఇతరుల బాధ్యతలతో పాటు వారి హక్కుల్ని కూడా విస్మరించరాదు. శక్తిని, అన్యాయానికి బదులుగా న్యాయస్థాపనకు ఆధారంగా చెయ్యాలి. హక్కును ఎట్టి పరిస్థితిలోనూ హక్కుగానే పరిగణించాలి, దాన్ని నెరవేర్చాలి. అధికారాన్ని దైవం అప్పగించిన అప్పగింతగా భావించాలి. ఈ అమానత్‌కు గాను దైవానికి పూర్తిగా లెక్క జూపవలసి ఉంటుందన్న దృఢ విశ్వాసంతో దీన్ని వినియోగించాలి.

# ప్రాథమిక హక్కులు

ఇస్లామీయ రాజ్యం ఓ ప్రత్యేకమయిన భూభాగంలో ఏర్ప డినా అది మానవ హక్కుల్ని భౌగోళిక సరిహద్దుల్లో పరిమితం చెయ్యదు. పౌర హక్కుల్ని కూడా అంతే. మానవతకు సంబం ధించినంతవరకు ఇస్లాం ప్రతి మానవునికి కొన్ని ప్రాథమిక హక్కుల్ని నిర్ణయిస్తుంది. ఎట్టి పరిస్థితిలోనూ వాటిని తప్పని సరిగా ఆదరించాలని ఆదేశిస్తుంది. మనిషి ఇస్లామీయ రాజ్య పరిధిలో ఉన్నా, దాని వెలుపల ఉన్నా, మిత్రుడయినా శత్రు వయినా, సంధి కుదుర్చుకున్న వాడయినా యుద్ధం చేస్తున్న వాడ యినా—మానవ రక్తం ఎలాంటి పరిస్థితిలోనూ ఆదరణీయ మయింది. నిష్కారణంగా, ధర్మబద్ధమయిన కారణం లేకుండా దాన్ని చిందించడానికి వీల్లేదు. స్త్రీలు, బాలలు, వృద్ధులు, క్షత గాత్రులపై చెయ్యి ఎత్తడం ఎప్పటికీ ధర్మ బద్ధం కాజాలదు. మానవతుల మానరక్షణ ఎట్టి వేళల్లోనూ గౌరవప్రదమయిందే. స్త్రీ మానభంగం జరగడానికి వీల్లేదు. ఆకలిగొన్న వాడు అన్నా నికి, బట్టల్లేనివాడు బట్టలకు, గాయపడినవాడు, వ్యాధిగ్రస్తుడు చికిత్సకు, శుశ్రూషకు ఎలాంటి పరిస్థితుల్లోనూ అర్హుడే—అతడు శత్రు జాతికి చెందిన వాడయినా సరే. ఈ హక్కులు, ఇంకా ఇలాంటివే మరి కొన్ని హక్కులు ఇస్లామ్ మానవునికి ప్రసాదిం చింది ఇస్లామీయ రాజ్యాంగంలో ఇవి ప్రాథమిక హక్కులుగా నమోదయి ఉన్నాయి.

పౌర హక్కుల విషయంలోనూ అది కేవలం దాని రాజ్య పరిధిలో పుట్టిన వారికి మాత్రమే వాటినివ్వదు. ముస్లిములు

ప్రపంచంలో ఏ మూలన పుట్టినా ఏ దేశానికి చెందినవారయినా ఇస్లామీయ రాజ్య పరిధిలో ప్రవేశించగానే తామై దానిపౌరులుగా పరిగణించబడతారు. జన్మతః పౌరులుగా వస్తున్న వారికి సమానంగా సకల హక్కులకు అర్హులవుతారు. ప్రపంచంలో ఎన్ని ఇస్లామీయ రాజ్యాలున్నాయో వాటి మధ్య పౌరసత్వం ఉమ్మడిగానే ఉంటుంది. ముస్లిములకు ఏ ఇస్లామీయ రాజ్యంలో ప్రవేశించడానికయినా ఎలాంటి పాస్‌పోర్టు ఆవశ్యకత ఉండదు. ముస్లిములు ఏ విధమయిన అనువంశిక, జాతీయ, వార్గిక విచక్షణ లేకుండా ఏ ఇస్లామీయ రాజ్యంలోనయినా సరే అత్యున్నత పదవీ బాధ్యతలను పొందగలరు.

ఇస్లామీయ రాజ్య పరిధిలో నివసించే ముస్లిమేతరులకు కూడా ఇస్లాం కొన్ని హక్కులు నిర్ణయించింది. అవి కూడా ఇస్లామీయ రాజ్యాంగంలో తప్పనిసరిగా స్థానం కలిగి ఉంటాయి. ఇస్లామీయ పరిభాషలో ఇలాంటి ముస్లిమేతరుల్ని జిమ్మీలని అంటారు. అంటే ఎవరి రక్షణాభారమయితే ఇస్లామీయరాజ్యం తనపై వేసుకుందో అలాంటివారన్నమాట. జిమ్మీల ధన మాన ప్రాణాలు ముస్లిముల ధన మాన ప్రాణాల మాదిరిగానే ఆదరణీయమయినవి. సివిల్, క్రిమినల్ చట్టాలో ముస్లిములూ జిమ్మీల మధ్య ఎలాంటి తారతమ్యం ఉండదు. జిమ్మీల పర్సనల్‌లా విషయంలో ఇస్లామీయ రాజ్యం ఎలాంటి జోక్యం చేసుకోదు. జిమ్మీలకు తమ అంతరాత్మ ప్రబోధాలకనుగుణంగా ఆచరించడానికి, విశ్వాసాలు కలిగిఉండటానికి, మతపరమయిన ఆచార వ్యవహారాలు పాటించడానికి ప్రార్థనలు జరుపుకోవడానికి సంపూర్ణమయిన స్వేచ్ఛప్రాప్తమయి ఉంటుంది. జిమ్మీలు తమ

ధర్మప్రచారమే కాదు చట్టం పరిధిలో ఉంటూ ఇస్లామ్‌ను విమర్శించడానికి కూడా హక్కు కలిగి ఉంటారు.

ఇవి, ఇంకా ఇలాంటి అనేక హక్కులు ఇస్లామీయ రాజ్యాంగం ప్రకారం ముస్లిమేతరపౌరులకు ఇవ్వబడ్డాయి. ఇవన్నీ శాశ్వతమయిన హక్కులు. ముస్లిమేతరులు ఇస్లామీయ రాజ్యం తీసుకున్న బాధ్యతలకు దూరం కానంతవరకు వారి ఈ హక్కుల్ని హరించడం ఎవరి తరమూ కాదు. ఏ ముస్లిమేతర రాజ్యమయినా తన ముస్లిం పౌరులపై ఎన్ని అత్యాచారాలు జరిపినా ఇస్లామీయ రాజ్యం మటుకు దానికి ప్రతిచర్యగా తన పరిధిలోని ముస్లిమేతర పౌరులపై షరీఅత్‌కు వ్యతిరేకంగా ఏ మాత్రం చెయ్యి చేసుకోవడానికి వీల్లేదు. చివరికి ఇస్లామీయ రాజ్య సరిహద్దుల కావల ఉండే ముస్లిములందరూ వధించబడినా అప్పటికీ ఇస్లామీయ రాజ్యంలోని ముస్లిములు తమ పరిధిలోని జిమ్మీల రక్తాన్ని కారణ రహితంగా చిందించడానికి వీల్లేదు.

## పరిపాలనా యంత్రాంగం, చట్టసభలు

ఇస్లామీయ రాజ్యంలో పరిపాలనా వ్యవస్థ అంతా ఒక అమీర్(నాయకుడు)చేతికి అప్పగించడం జరుగుతుంది. నేటి పరిభాషలో గణతంత్ర రాష్ట్రపతిగా **(President of the Republic)** కు సమానంగా భావించవచ్చు. అమీర్ ఎన్నికలో ప్రాజ్ఞతగల స్త్రీ పురుషులందరికీ ఓటు ఇచ్చే అధికారముంటుంది. అయితే వీరంతా రాజ్యాంగం మౌలిక సూత్రాలను నమ్మేవారు, వాటిని స్వీకరించినవారయి ఉండాలి. ఎన్నికకు ప్రాతిపదికలు ఇవి ;

ఇస్లాం నిజ సారాన్ని ఎరిగి ఉండటంరీత్యా ఇస్లామీయ స్వరూప స్వభావాలు, దైవభక్తి, విజ్ఞత వివేకాల దృష్ట్యా ఏ వ్యక్తి అయితే సమాజంలో అత్యధిక ప్రజల విశ్వాసాన్ని చూరగొంటాడో అలాంటి వ్యక్తిని అమీర్‌గా ఎన్నుకోవడం జరుగుతుంది. అతనికి సహాయ పడటానికి ఓ సలహా మండలిని (మజ్లిసె షూరా) ఏర్పరుస్తారు. అది కూడా ప్రజల ద్వారానే ఎన్నుకోబడుతుంది. దేశ పరిపాలన సలహా మండలి సలహాల ప్రకారం చేస్తాడు అమీర్. ప్రజల విశ్వాసం పొందగలిగినంత కాలమే ఒక వ్యక్తి అమీర్‌గా మన గలుగుతాడు. విశ్వాస రాహిత్యం ఏర్పడిన పక్షంలో అతను తన స్థానాన్ని వదలివెళ్ళవలసి ఉంటుంది. అయితే అతను ప్రజల విశ్వాసం కలిగి ఉన్నంత కాలం అతనికి పరిపాలనాధికారాలన్నీ ఉంటాయి. అతను సలహా మండలి మెజారిటీకి వ్యతిరేకంగా తన వీటోను వినియోగించగలడు. ఇలాగే అమీర్, అతని పరిపాలనను విమర్శించే సంపూర్ణ అధికారం పౌరులందరికీ ఉంటుంది.

ఇస్లామీయ రాజ్యంలో శాసన నిర్మాణం, షరీఅత్ నిర్ణయించిన పరిధుల్లోనే జరుగుతుంది. దైవం, దైవప్రవక్త (సఅసం) చేసిన ఆదేశాలు కేవలం పాటించడానికే కాని వాటిలో ఏ శాసన నిర్మాణ సభ అయినా మార్పులూ చేర్పులూ చెయ్యజాలదు. పోతే, ఏ ఆదేశాల విషయంలోనయితే విభిన్న నిర్వచనాలు సాధ్యమో అలాంటి వాటిలో షరీఅత్ అభిమతాన్ని తెలుసుకోవడం షరీఅత్ జ్ఞానం గల పండితులదే. అందువల్ల ఇలాంటి వ్యవహారాలన్నీ సలహా మండలి సబ్ కమిటీకి అప్పగించబడతాయి. ఈ సబ్ కమిటీల్లో ధర్మవేత్తలు ఉంటారు. ఇక

మిగిలింది నిత్య వ్యవహారాల సువిశాలమయినక్షేత్రం. ఇందులో షరీఅత్ ఎలాంటి ఆదేశాలూ ఇవ్వలేదు. ఇలాంటి వ్యవహారాలన్నింటిలో, ధార్మిక పరిధిలో ఉంటూ మజ్లిసేషూరా (సలహా మండలి) స్వేచ్ఛగా శాసన నిర్మాణం చేస్తుంది.

ఇస్లామీయ షరీఅత్ ప్రకారం, న్యాయ వ్యవస్థ పరిపాలించే ప్రభుత్వానికి లోబడి రూపొందదు. అది నేరుగా దైవ ప్రాతినిధ్యం కలిగి, దైవానికే జవాబుదారీ కలిగి ఉంటుంది. న్యాయాధిపతుల్ని ప్రభుత్వమే నియమించినా ఒక సారి ఒకవ్యక్తి న్యాయ పీఠాన్ని అధిరోహిస్తే అతను దైవ శాసనం ప్రకారమే ప్రజల మధ్య నిష్పక్షపాతంగా న్యాయం చేస్తాడు. ఆ న్యాయ నిర్ణయాల పరిధిలో ప్రభుత్వం కూడా రావచ్చు, చివరికి ప్రభుత్వాధినేత కూడా న్యాయాధిపతి సమక్షంలో ముద్దాయిగానయినా దావేదారుగానయినా ఓ సామాన్య పౌరుడిగానే నిలువవలసి ఉంటుంది.

—(o)—

# 4

# ఇస్లాంలో సామాజిక జీవితం

ఇస్లామీయ సామాజిక వ్యవస్థకు ప్రాతిపాదిక, ప్రపంచ మానవులంతా ఒకే సంతతిలోని వారు, సమానులు, సోదరులు అన్న విశ్వాసం, ఆ సిద్ధాంతం.

## మానవాళి సమానత

దైవం మొదట మానవుల ఒక జంటను సృజించాడు. ఆ జంట ద్వారానే ప్రపంచంలో నివసించే మానవులంతా పుట్టారు. ప్రారంభంలో చాలా కాలం వరకు ఈ దంపతుల సంతానం ఒకే సమాజంగా వ్యవహరించింది. అది అనుసరించే ధర్మం ఒక్కటే, దాని వాడుకలో ఉన్న భాష కూడా ఒక్కటే. ఆ సమాజంలో ఎలాంటి విభేదాలుండేవి కావు. కాని వారి సంఖ్య పెరుగుతూ పోయినకొద్దీ వారు భువిలో విస్తరించసాగారు. ఈ విస్తరణ కారణంగా సహజంగానే విభిన్న వంశావళులుగా, వేర్వేరుజాతులుగా

తెగలుగా విభజనకు గురయ్యారు. వారి భాషలు కూడా వేర్వే రయ్యాయి. దేశ దేశాల శీతోష్ణ స్థితులు వారి రూపు రేఖల్ని, రంగు హంగుల్ని, వడ్డూపొడవును సయితం మార్చివేశాయి. ఈ విభేదాలు, తారతమ్యాలన్నీ సహజ సిద్ధమయినవి. నేడు వాస్తవ జగత్తులో అవి ప్రస్ఫుటంగా గోచరిస్తున్నాయి. అందువల్ల ఇస్లాం వాటిని ఒక యదార్థంగా అంగీకరిస్తుంది. వాటిని అది రూపుమాప దలచలేదు. అంతేకాక, మానవుల పరస్పర పరిచయం, సహ కారం ఈ విధంగానే సాధ్యమవుతుందని వీటి ప్రయోజ నాన్నీ అంగీకరిస్తుంది. అయితే ఈ విభేదాల మూలంగా మాన వుల మధ్య రంగు, భాష, జాతి, దేశం ప్రాతిపదికగా ఉత్పన్న మయిన దురభిమానాలను ఇస్లాం పూర్తిగా ఖండిస్తుంది. అవన్నీ అపసవ్యమయినవని నిర్ణయిస్తుంది. మనిషీ మనిషికి మధ్యగల నిమ్నోన్నతా భేదభావాలు, శ్రేష్ఠులు, అధములు, తమ వారు, పరాయివారు అని పుట్టుక ఆధారంగా ఏర్పరుచుకున్న తార తమ్యాలన్నీ ఇస్లాం దృష్టిలో అజ్ఞానానికి ప్రతీకలు. అది ప్రపంచ మానవులనందరినీ- మీరంతా ఒకే తల్లి ఒకే తండ్రికి సంతానమని, ఈ కారణంగా పరస్పరం సోదరులని, మానవు లవడం మూలాన సమానులని తెలుపుతుంది.

మానవాళికి సంబంధించిన ఈ భావనను ప్రతిపాదించి ఇస్లాం చెప్పేదేమంటే, మనిషీ మనిషికి మధ్య అసలయిన వ్యత్యాసమంటూ ఏదయినా ఉంటే అది రంగు, వంశం, దేశం, భాషల ప్రాతిపదికపై కాదు, కేవలం సిద్ధాంతాలు, భావాలు, నైతి కత, ప్రాతిపదికపైనే కాగలదు. ఒకే తల్లికి పుట్టిన ఇద్దరుబిడ్డలు తమ వంశం రీత్యా ఒకటే అయినా వారి భావాలు, నైతిక వ్యవ

పోరాలు భిన్నమయినట్లయితే జీవితంలో వారి మార్గాలు వేరవు తాయి. దీనికి భిన్నంగా తూర్పు దిక్కు చివరన ఒకరు, పడమర దిక్కు చివరన ఒకరు నివసిస్తూ బాహ్యారూపంలో పరస్పరం ఎంత దూరమయినా భావాల్లో సారూప్యత ఉంటే, నైతిక ప్రవర్తన ఇద్దరిదీ ఒకటయితే వారి జీవన పథం ఒకటే అవుతుంది. ఈ సిద్ధాంతం ఆధారంగా ఇస్లాం, ప్రపంచంలోని సకల వర్ణ, వంశ, దేశ, జాతి తత్వాలపై ఆధారపడిన సమాజాలకు భిన్నంగా, సైద్ధాంతిక, నైతిక ఆధారాలపై సూత్రప్రధానమయిన సమాజాన్ని నిర్మిస్తుంది.

ఇందులో మనిషిని మనిషితో కలిపే ప్రాతిపదిక అతని పుట్టుక కాదు వారి విశ్వాసాలు, నైతిక నియమాలు మాత్రమే. దైవాన్నే తన స్వామిగా ఆరాధ్యుడుగా భావించి, దైవప్రవక్తలు అందజేసిన మార్గదర్శకత్వాన్ని తన జీవిత నియమావళిగా అంగీకరించే ప్రతి వ్యక్తి ఈ సమాజంలో చేరిపోతాడు-అతడు ఆఫ్రికా నివాసి అయినా, అమెరికా పౌరుడు అయినా, అతడు సెమెటిక్ (Semetic) జాతి (Race )కి చెందినవాడయినా ఆర్యన్ (Aryan) జాతికి చెందిన వాడయినా, నల్ల వాడయినా తెల్ల వాడయినా, అతను హిందీ మాట్లాడినా అరబీ మాట్లాడినా, ఎవరెవరైతే ఈ సమాజంలో చేరిపోతారో వారందరికీ సమానమయిన హక్కులు లభిస్తాయి. వారందరి సామాజిక స్థానాలు ఒకటే అవుతాయి వారి మధ్య ఏ విధమయిన వంశానుగత, జాతీయ, వార్గిక వివక్షలు చోటు చేసుకోవు. ఎవరూ ఉన్నతులు కారు, మరెవరూ నీచులు కారు. ఏ విధమయిన అస్పృశ్యతా భావాలు వారిమధ్య ఉండవు.ఎవరి చెయ్యి తగిలినా ఎవరూ అపరిశుద్ధులు కారు.

వివాహాది సంబంధాల్లోనూ, ఆహార పానీయాల్లోనూ, కలసి మెలసి జీవించడంలోనూ వారి మధ్య ఎలాంటి అవరోధాలుండవు. ఎవరూ తన పుట్టుక కారణంగా లేక వృత్తి రీత్యా నీచుడుగానో తుచ్ఛుడుగానో పరిగణించబడడు. ఎవరికీ తమ కులం వర్గం, వంశం, గోత్రం కారణంగా ఎలాంటి ప్రత్యేక హక్కులు రాయితీలు లభించవు. మనిషి శ్రేష్ఠత అతని వంశం మూలంగానో అతని సిరిసంపదల కారణంగానో ఏర్పడదు. ఎవరి నైతికవర్తనం అందరికంటే ఉత్తమమయిందో, ఎవరు భయభక్తుల్లో అందరినీ మించిపొయ్యారో కేవలం వారే శ్రేష్ఠులు.

ఈ సమాజం, వంశం, వర్ణం భాషల పరిధుల్ని, భౌగోళిక సరిహద్దుల్ని త్రెంచివేసి భువిలో ఎల్లెడలా విస్తరించగలదు. దీని ఆధారంగా మానవాళి ఓ విశ్వజనీన సమాజంగా రూపొందుతుంది. వంశానుగత, జాతీయ ప్రాతిపదికలపై ఏర్పడ్డ సమాజాల్లో నయితే ఆయా జాతులు, వంశావళిలో పుట్టిన వారే చేరగలుగుతారు. దానికి వెలుపల ఉన్న వారెవరికయినా ఇలాంటి సమాజం ద్వారాలు సదా మూయబడి ఉంటాయి కాని ఇస్లాం ప్రతిపాదించే సైద్ధాంతిక సూత్రబద్ధమయిన సమాజంలో, దాని విశ్వాసాలను, నైతిక నియమాలను స్వీకరించిన ప్రతి వ్యక్తి అన్ని హక్కులూ సమానంగా పొందుతూ చేరిపోగలడు. పోతే ఎవరయితే దాని విశ్వాసాలను, నియమాలను విశ్వసించరో వారిని ఈ సమాజం తన పరిధిలో చేర్చుకోదు. అయితే మానవీయ సోదర సంబంధాలు వారిలో కలిగి ఉండటంతోపాటు మానవ హక్కుల్ని వారికి ఇవ్వడానికి సిద్ధంగా వుంటుంది. ఒకే తల్లికి పుట్టిన ఇద్దరు కొడుకులు భావాల్లో భిన్నత్వం కారణంగా వారి

జీవిత విధానాలు వేరవుతాయి. కాని అంతమాత్రాన వారు సోద రులు కాకపోరు. అచ్చంగా అలాగే ఇరు వర్గాలు కూడా విశ్వా సాల్లో, సిద్ధాంతాల్లో భిన్నత్వానికి లోనైనట్లయితే వారిసమాజాలు కూడా నిశ్చయంగా వేర్వేరుగానే రూపొందుతాయి. కాని మానవత అన్నది ఉభయుల మధ్య సమిష్టి ప్రమాణంగా ఉంటుంది. ఈ సమిష్టి భావం, మానవత ఆధారంగా ఎన్నెన్ని హక్కులయితే ఊహించడానికి వీలుందో అవన్నీ ఇస్లామేతర సమాజాలకు లభించాలని ఇస్లామీయ సమాజం అంగీకరించింది.

## కుటుంబ వ్యవస్థ

మానవ సమాజానికి పునాదిరాయి కుటుంబం. కుటుంబం అనేది ఒక స్త్రీ మరొక పురుషుని కలయికవల్ల ఏర్పడుతుంది. ఈ కలయిక వల్ల ఒక కొత్త తరం ఉనికిలోకి వస్తుంది, ఈ కుటుం బం ద్వారానే బంధుత్వాలు, వంశం, చుట్టరికాలు ఇంకా ఇతర సంబంధాలు ఉత్పన్నమవుతాయి. ఇదే పెరుగుతూ విస్తార మవుతూ చివరికి ఓ సమాజంగా రూపుదాల్చుతుంది. అలాగే, ఒక తరం ప్రజలు, తమ భావితరం వారు మానవ నాగరికతకు సంబంధించిన విస్తృత బాధ్యతల్ని మోసేలా — ఎంతోప్రేమతో, మరెంతో త్యాగనిరతితో, ఆర్ద్రత నిండిన గుండెలతో, స్వచ్ఛ మయిన శ్రేయోభిలాషతో వారిని సన్నద్ధం చేసేది కూడా ఈ కుటుంబ వ్యవస్థలోనే, ఈ వ్యవస్థ మానవ నాగరికత మనుగడకై, దాని పురోభివృద్ధికై కేవలం రిక్రూటులను భర్తీ చెయ్యడమే కాదు. ఈ వ్యవస్థలోని సభ్యులు తమ స్థానంలో వచ్చే వారు తమ కంటే

మెరుగయిన వారే అయి ఉండాలని మనసారా కోరుకుంటారు. ఈ కారణంగా, కుటుంబమే మానవనాగరికతకు మూలస్థానమన్న విషయం, దీనితోపాటు ఈ మూలం ఆరోగ్యవంతంగా శక్తిమంతంగా ఉండటం పైనే నాగరికత యొక్క ఆరోగ్యాలు. శక్తి ఆధారపడి ఉంటాయన్న విషయమూ యదార్థమే. అందువల్ల సామాజిక సమస్యల పరిష్కారంలో, కుటుంబ వ్యవస్థను అత్యుత్తమమయిన, పటిష్టమయిన ఆధారాలపై నిలబెట్టాలన్న విషయానికి అత్యంత ప్రాధాన్యతనిస్తుంది ఇస్లాం.

ఇస్లాం దృష్టిలో స్త్రీ పురుషుల సంబంధాలకు సవ్యమయిన రూపం ఒక్కటే, అందులో సామాజిక బాధ్యతలు స్వీకరించబడాలి. దాని ద్వారా ఒక కుటుంబానికి అంకురార్పణ జరగాలి. విచ్చలవిడిగా, బాధ్యతారహితంగా ఏర్పడే స్త్రీ పురుష సంబంధాన్ని ఇస్లాం కేవలం నిరపాయకరమయిన కాలక్షేపంగానో లేక చాలా సాధారణమయిన పొరపాటుగానో భావించి త్రోసిపుచ్చదు. ఇస్లాం దృష్టిలో అది మానవ నాగరికత పునాదులనే కదిలించి వేసే చర్యగా పరిగణించడం జరుగుతుంది. అందువల్ల ఇలాంటి సంబంధాన్ని నిషిద్ధమయినదిగా (హరామ్‌గా), చట్టపరమయిన అపరాధంగా పరిగణిస్తుంది ఇస్లాం. దానికి కఠిన శిక్షను అది ప్రతిపాదిస్తుంది. తద్వారా సమాజంలో నాగరికతకే హానికరమయిన ఇలాంటి సంబంధాలు వృద్ధిపొందకుండా ఉండాలని అది కోరుకుంటుంది.

సామాజిక వ్యవస్థలో ఇలాంటి బాధ్యతారహితమైన సంబంధాలకు ప్రేరకాలుగా మారే లేక వాటికి అవకాశాలను సృష్టించే కారణాలను సమాజం నుండి దూరం చెయ్యాలని అభిలషిస్తుంది.

ఇస్లాం. పరదా ఆదేశాలు, స్త్రీ పురుషుల స్వేచ్ఛాయుతమయిన కలగలపును నిషేధించడం, వాయిద్య సంగీతం, మానవ చిత్రాలపై ఆంక్షలు, నీతిబాహ్యమయిన విషయాల ప్రచార ప్రసారాలకు అవరోధాలు. అన్నీ ఈ అక్రమ సంబంధాల నివారణ కొరకే. వీటి ప్రధాన లక్ష్యం కుటుంబ వ్యవస్థను పరిరక్షించడం, పటిష్టం చెయ్యడం ఒక్కటే.

మరో వైపున స్త్రీ పురుషుల బాధ్యతాయుతమయిన సంబంధాన్ని అంటే వివాహాన్ని (నికాహ్‌ను) ఇస్లాం కేవలం ధర్మబద్ధం చెయ్యడమే కాదు, దాన్ని సత్కార్యంగా, పుణ్యప్రదమయిన చర్యగా, ఆరాధనగా పరిగణిస్తుంది. ప్రాజ్ఞత వచ్చిన తరువాత స్త్రీ పురుషులు పెళ్ళి లేకుండా ఒంటరిగా ఉండటాన్ని ఇష్టపడదు. యువకులు, తమ తల్లిదండ్రులు నాగరికతకు సంబంధించిన ఏ బాధ్యతలనైతే తమపై వేసుకున్నారో వాటిని తమ వంతు వచ్చినప్పుడు తాము, కూడా మొయ్యాలని అది వారిని ప్రేరేపిస్తుంది. ఇస్లాం వైరాగ్యాన్ని సత్కార్యంగా భావించదు. దాన్ని దైవసృష్టికి వ్యతిరేకంగా జరిపే ధర్మ విహీనమయిన చర్యగా భావిస్తుంది.

నికాహ్ లేక పెళ్ళిని ఎంతో కష్టమయిన బరువయిన కార్యంగా మార్చివేసే ఆచారాల సంప్రదాయాలను సయితం అది ఇష్టపడదు. దాని అభిమతమేమిటంటే సమాజంలో నికాహ్ (పెళ్ళి) చాలా సులువయిన కార్యం కాగలగాలి — దానికి భిన్నంగా నికాహ్ కష్టసాధ్యమయి వ్యభిచారం సులభతరమవడం దానికి పడదు. అందువల్లనే అది, కొన్ని ప్రత్యేక బంధుత్వాలను హరామ్‌గా నిషేధించిన తరువాత మిగతా దగ్గరి, దూరపు బంధుత్వాలన్నింటితో దాంపత్య సంబంధాలను ధర్మ సమ్మతం

చేసి వేసింది. కుల గోత్రాల విభేధాలన్నింటినీ రూపుమాపి ముస్లిములందరు పరస్పర వివాహసంబంధాలు కలిగి ఉండటానికి విస్తృతంగా అనుమతినిచ్చింది. మహర్, జహేజ్ లాంటివాటిని ఎంతో తేలికగా, వాటిని ఇరుపక్షాలు సునాయాసంగా భరించేలా నిర్ణయించుకునేందుకు ఆదేశాలు ఇచ్చింది. నికాహ్‌ను జరపడానికి కాజీగారు, పండితులు, పురోహితులు, దానికి ఫైళ్ళు రిజిష్టర్లు వీటన్నింటి అవసరం లేదని చాటింది ఇస్లామీయ సమాజంలో నికాహ్ చాలా నిరాడంబరమయిన ఆచారం. ఎక్కడయినా సరే ఇద్దరు సాక్షుల ఎదుట ప్రాజ్ఞత పొందిన (Minority దాటిన) స్త్రీ పురుషులు తమ సమ్మతి, అంగీకారాలు తెలిపి నికాహ్ తంతును నెరవేర్చవచ్చు. అయితే ఈ సమ్మతీ, స్వీకారాల తతంగం దాపరికంగా, గోప్యంగా జరగరాదు. ఊరిలో బాహాటంగా ప్రకటన ద్వారానే జరగాలి.

ఇస్లాం కుటుంబంలో పురుషునికి కార్యవాహకుని(Manager) హోదా కల్పించింది-అతడు తన ఇంటిలో క్రమశిక్షణను నెలకొలపడానికి. భార్య, భర్తకు విధేయత చూపాలని, సంతానం తల్లిదండ్రులిరువురికీ విధేయతచూపాలనీ ఆదేశించింది. ఎలాంటి క్రమబద్ధత లేని ఇంటిని, ఇంటివారి నైతికతను వారి వ్యవహారాలను సక్రమంగా ఉంచే పెద్ద దిక్కులేని విచ్చలవిడి కుటుంబ వ్యవస్థను ఇస్లాం సుతరామూ ఇష్టపడదు క్రమబద్ధత అన్నది 'పెద్ద' అంటూ ఒకరు ఉన్నప్పుడే సాధ్యమవుతుంది, ఇస్లాం దృష్టిలో ఈ బాధ్యతకై కుటుంబంలో తండ్రే సహజంగా తగినవాడు.

కాని దీని ఆధారంగా పురుషుడు ఇంటిలో బలవంతుడు క్రూరుడయిన పరిపాలకుడిలా రూపొందాలని అర్థం కాదు, స్త్రీని ఏమీ చెయ్యలేని బానిస రూపంలో అతనికి అప్పగించడం జరిగిందనీ అర్థం కాదు. ఇస్లాం దృష్టిలో దాంపత్య జీవితానికి అసలు ఊపిరి ప్రేమ, కారుణ్యాలు. భర్త విధేయతను పాటించడం స్త్రీ విధి అయినట్లే పురుషుడు ప్రేమాదరణలతో, కుటుంబ శ్రేయమే తన ధ్యేయంగా మెలగాలని, తన అధికారాలను దౌర్జన్యం జరపడానికి కాకుండా సంస్కరణ కోసమే వినియోగించాలని అతని బాధ్యతల్ని నిర్ణయిస్తుంది.

ఇస్లాం దాంపత్య సంబంధాన్ని, అందులో ప్రేమకమ్మదనం జాలువారే వరకు, లేదా కనీసం చెలిమి కొనసాగే అవకాశం ఉన్నంతవరకు మటుకే కొనసాగనివ్వాలని అభిలషిస్తుంది. ఈ అవకాశాలు దెబ్బతిని సంబంధాలు బెడిసికొట్టిన పక్షంలో అది పురుషునికి తలాక్ (విడాకులు) ఇచ్చే హక్కును, స్త్రీకి ఖులా (స్త్రీ తరఫున విడాకులు)ఇచ్చే హక్కును– ఆ మేరకు ఆదేశాలను ఇస్తుంది. కొన్ని సందర్భాలలో కారుణ్యానికి కాక కార్పణ్యాలకు ఆలవాలమయిన ఇటువంటి నికాహ్ సంబంధాన్ని భగ్నం చేసి వేసేందుకు ఇస్లామీయ న్యాయస్థానానికి అధికారాలను కూడా ఇస్తుంది ఇస్లాం.

## చుట్టాలు, చుట్టుపక్కలవారు

కుటుంబ పరిమిత పరిధులకు వెలుపల అతి సమీప సరిహద్దులు బంధుత్వాలకు సంబంధించినవి. ఇది సువిశాలమయిన

క్షేత్రం. ఎవరయితే తల్లిదండ్రుల మూలంగా, సోదరీ సోదరుల కారణంగా, అత్తమామల ద్వారా పరస్పరం చుట్టాలవుతారో వారందరూ ఒకరికొకరు అండదండలుగా, సానుభూతి చూపుకునే వారుగా ఉండాలని కోరుకుంటుంది. దివ్యఖుర్ఆన్‌లో పలుచోట్ల 'జవిల్ కుర్‌బా' అంటే బంధువుల ఎడల మంచిగా ప్రవర్తించాలని ఆదేశించడం జరిగింది. హదీసులో 'సిలరహ్మి' లేక బంధువులపట్ల ప్రేమానురాగాలతో మెలగాలని మాటి మాటికీ తాకీదు చెయ్యడం జరిగింది. దీన్ని సత్కార్యాల్లో గొప్పనయినదిగా సూచించడం జరిగింది. ఎవరయితే తమ చుట్టాలను గురించి నిరాసక్తంగా, కఠినంగా, చూచీ చూడనట్లు వ్యవహరిస్తారో అలాంటి వారు ఇస్లాం దృష్టిలో మంచికారు కారు.

అయితే బంధువులను అక్రమంగా, అధర్మంగా వెనక వేసుకురావడం ఇస్లామీయ దృక్పథం అన్నది దీనికి అర్థంకారాదు. తన వంశం, తన తెగవారిని అధర్మంగా బలపరచడం ఇస్లాం దృష్టిలో అజ్ఞానకాలపు చర్య. అలాగే ప్రభుత్వోద్యోగి ఎవరైనా ప్రజాధనంపై భారం వేసి బంధుప్రీతికి పాల్పడినట్టయితే లేదా తన నిర్ణయాల్లో తన బంధువుల పట్ల అక్రమంగా రాయితీలు కల్పించినట్లయితే ఇదంతా ఇస్లామీయ విధానానికి విరుద్ధం. ఇవన్నీ పాపపు కార్యాలుగానే పరిగణించబడతాయి. ఇస్లాం బంధువుల ఎడల ఏ దయాగుణాన్ని చూపమంటుందో అది తాను సొంతంగా చెయ్యాలి. అదీ న్యాయం ధర్మం పరిధుల్లో జరగాలి.

బంధుత్వ సంబంధాల తరువాతి దగ్గరి సంబంధం పొరుగు వారితో ఉంటుంది. దివ్యఖుర్ఆన్ దృష్ట్యా పొరుగువారు మూడు రకాలు. ఒకటి బంధువయిన పొరుగువారు; రెండు, పరిచయం

లేని పొరుగువారు ; మూడు, తాత్కాలిక పొరుగు వారు : యాదృచ్ఛికంగా తోడుగా కూర్చునే వారు లేక కలసి ప్రయాణం చేసే వారన్నమాట. వీరంతా ఇస్లామీయ శాసనాంగం దృష్ట్యా చెలిమికి, సానుభూతికి, మంచి ప్రవర్తనకు అర్హులు.

ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా చెప్పారు, "నాకు పొరుగువాని హక్కుల గురించి ఎంత అధికంగా తాకీదు చెయ్యబడిందంటే, ఇక పొరుగువాణ్ణికూడా వారసత్వంలో భాగస్వామిగా చెయ్యడం జరుగుతుందేమో అన్న అనుమానం కలగ సాగింది."

మరో హదీసులో ఆయన (సఅసం), "ఎవరి పొరుగు వాడైతే అతని చెడు నడత వల్ల బాధపడతాడో అతడు విశ్వాసి(ముస్లిం) కాడు." అని అన్నారు.

మరోచోట, "ఒక వ్యక్తి కడుపు నిండా భోంచేసి అతని పొరుగునుండే వాడు ఆకలితో పడి ఉంటే అలాంటి వ్యక్తిలో విశ్వాసం చోటుచేసుకోలేదు"అని కూడా ఆయన నుడివారు.

ఒకసారి దైవ ప్రవక్త(సఅసం) తో ఎవరో విన్నవించుకున్నారు. "ఒక స్త్రీ చాలా ఎక్కువగా నమాజులు చేస్తుంది, తరచుగా ఉపవాసవ్రతాన్ని పాటిస్తుంది. ఇతోధికంగా దాన ధర్మాలు చేస్తుంది. కాని ఆమె నోటి దురుసుతనం వల్ల ఆమె పొరుగువారు విసుగెత్తిపొయ్యారు అని." దానికి ప్రవక్త (సఅసం) "ఆమె నరకవాసి"అని చెప్పివేశారు. తరువాత ఆ ప్రజలే ఇలా చెప్పసాగారు, "మరో మహిళ ఉంది, అయితే ఆమెలో మొదటి స్త్రీలోని సుగుణాలయితే లెవ్వు, కాని ఆవిడ తన పొరుగు వారికి ఎలాంటి కష్టం కలగజెయ్యదు."అదివిని ఆయన (సఅసం)"ఈమె స్వర్గవాసి" అని బదులిచ్చారు.

దైవప్రవక్త పొరుగువాని గురించి ప్రజలకు ఎంతగా తాకీదు చేశారంటే, "మీరు మీ బిడ్డల కోసం పళ్ళు తీసుకువస్తే పొరుగు వారి ఇంటికీ పంపండి. పంపలేకపోతే పళ్ళ తోలు బయట పారెయ్యకండి నిరుపేద పొరుగువాని మనసు బాధ పడకుండా ఉంటుంది." అని బోధించారు.

ఒకసారి ఆయన, "నీ పొరుగు వారు నిన్ను మంచి వానిగా కీర్తిస్తే నీవు మంచివాడవు, ఒక వేళ పొరుగువారి అభిప్రాయం నీ గురించి చెడుగా ఉన్నట్లయితే నీవు చెడ్డవాడవే!" అని హెచ్చరించారు.

ఒక్క మాటలో చెప్పాలంటే, ఇస్లాం ఇరుగు పొరుగు వారి నందరినీ పరస్పరం సానుభూతి, సహాయసహకారాలు అందచేసుకునే వారుగా, సుఖదుఃఖాలను పంచుకునే వారుగా తీర్చిదిద్దాలని అభిలషిస్తుంది. వారందరూ పరస్పరం ఒకరిపై నొకరు భరోసా చేసుకుని ఒకరి ప్రక్కలో మరొకరుంటూ తమ ధన మాన ప్రాణాలు సురక్షితంగా ఉంటాయని నిర్భయంగా ఉండాలని కోరుకుంటుంది. పోతే, ఒకే గోడకు ఇరువైపులా ఉండే వారు సంవత్సరాల తరబడి ఒకరి కొకరు అపరిచితులుగా ఉండే సమాజం, ఒకే వీధిలోని వారి మధ్య ఎలాంటి ఆసక్తి, సానుభూతి, విశ్వాసం చోటు చేసుకోని సమాజం ఎంత మాత్రం ఇస్లామీయ సమాజం కాజాలదు.

ఈ దగ్గరి పరిధుల తరువాత మొత్తం సమాజానికి విస్తరించి ఉన్న సువిశాల పరిధి వస్తుంది. ఈ విస్తృత పరిధిలో సాము హిక జీవితానికిగాను ఇస్లాం ఏ సూత్రాలను ప్రతిపాదిస్తుందో అవి ముఖ్యమయినవి, క్లుప్తంగా ఇవి :

(1) సత్కార్యాల్లోను భయభక్తుల పనుల్లోనూ సహాయ సహకారాలందించుకోండి. చెడు పనులు, దౌర్జన్యపు కార్యాల్లో ఎంత మాత్రం సహకరించరాదు. (ఖుర్ఆన్)

(2) మీ మైత్రి అయినా శత్రుత్వం అయినా కేవలం దైవం కొరకే కావాలి. ఎవరికి ఏది ఇచ్చినా ఆయన కొరకే ఇవ్వండి, అలా ఇవ్వడం దైవానికి ఇష్టమయితేనే ఇవ్వండి. ఏదయినా ఎవరికయినా ఇవ్వడం మానుకోదలిస్తే దైవం కొరకే మానుకోండి. దైవానికి అలా ఇవ్వడం ఇష్టం లేని పక్షంలోనే మానుకోండి. (హదీసు)

(3) మీరు ఉత్తమ సమాజానికి చెందిన ప్రజలు. మిమ్మల్ని ప్రపంచ ప్రజల మేలు కొరకు ప్రభవింపజెయ్యడం జరిగింది. మంచికై ఆదేశించడం చెడును వారించడం మీ కర్తవ్యం. (ఖుర్ఆన్)

(4) పరస్పరం కుశంకలకు పాల్పడకండి; ఒకరి వ్యవహారంలో మరొకరు కూపీలు తీయకండి; ఒకరికి వ్యతిరేకంగా మరొకరిని ఉసికొలపకండి; మీలో మీరు ఈర్ష్యా ద్వేషాలకు లోనవకండి; ఒకరి నొకరు అడ్డుకోవడానికి పూనుకోకండి; దేవుని దాసుల్లా పరస్పరం సోదరుల్లా జీవించండి. (హదీసు)

(5) ఒకడు అత్యాచారుడని, దౌర్జన్యపరుడని తెలిసీ అతనికి తోడ్పాటునివ్వకండి. (హదీసు)

(6) అధర్మమైన విషయంలో తమ జాతి వారిని సమర్థించడం, మీ ఒంటె గోతిలో పడుతూ ఉంటే మీరున్నూ దాని

తోక పట్టుకుని దానితో పాటు నూతిలో పడటం లాంటిది.
(హదీసు)

(7) మీకు ఇష్టమయిన దాన్నే ఇతరులకై కూడా ఇష్టపడండి.
(హదీసు)

—(о)—

# 5

# ఇస్లాం ప్రతిపాదించే ఆర్థిక సూత్రాలు

మానవుని ఆర్థిక జీవితాన్ని న్యాయం నిజాయితీల ఆధారంగా నిలబెట్టడానికి ఇస్లాం కొన్ని సూత్రాలు, కొన్ని హద్దులు నిర్ణయించింది ధన ఉత్పాదన, దాని వినియోగం, దాని పంపిణీ అంతా దాని కోసం నిర్ణయించిన ఇస్లామీయ పరిధుల్లోనే నడవాలి.

ధన ఉత్పాదనకు సంబంధించిన విధానాలు, దాని పంపిణీ మార్గాలు ఏవయి ఉండాలి? అన్న విషయాన్ని ఇస్లాం కట్టడి చెయ్యదు. ఈ విషయాలయితే విభిన్న కాలాల్లో నాగరికత అభివృద్ధితో పాటు రూపొందుతూ పరివర్తన చెందుతూ ఉంటాయి. వీటి నిర్ణయం మానవుల పరిస్థితులు, అవసరాలకనుగుణంగా వాటంతట అవే జరుగుతూ ఉంటుంది. ఇస్లాం కోరేది ఒక్కటే, సర్వకాల సర్వావస్థల్లోనూ మానవుని ఆర్థిక వ్యవహారాలు ఏ రూపాలు ధరించినా వాటిలో ఇస్లాం సూచించే సూత్రాలు శాశ్వతంగా సుస్థిరంగా సంస్థాపితమయి ఉండాలి. ఆ పరిధుల్ని ఎట్టి పరిస్థితుల్లోనూ జవదాటడం జరగరాదు.

ఇస్లామీయ దృక్పథం రీత్యా భూమి ఇందులోని సకల వస్తువులు మానవాళికై దైవం సృష్టించినవే. అందువల్ల భూమి ద్వారా తన ఉపాధిని సాధించే కృషి చెయ్యడం ప్రతి మనిషికీ గల జన్మహక్కు. ఈ హక్కు మానవులందరికీ సమంగా వర్తిస్తుంది. ఎవ్వరినీ ఈ హక్కుకు దూరంచెయ్యడం సాధ్యంకాదు. మరెవ్వరినీ ఈ విషయంలో మరొకరిపై ప్రాధాన్యత నివ్వడమూ సాధ్యపడదు. ఒక వ్యక్తి, ఒక జాతి, ఒక వర్గం-ఎవరికయినా సరే ఉపాధి మార్గాల్లో కొన్నింటిని వినియోగించుకునే హక్కు అసలే లేదని లేక కొన్ని వృత్తులు వారికి నిషిద్ధమని కట్టడిచెయ్యడానికి షరీఅత్ అనుమతించదు. అలాగే కొన్నిఉపాధిమార్గాలు వృత్తి విధానాలు కొందరికి ప్రత్యేకించి దాన్ని కొన్నివర్గాలు,వర్ణాలు వంశాల వరకు పరిమితంచెయ్యగల విచక్షణలు ఏర్పరచడంకూడా షరీఅత్ ప్రకారం సాధ్యం కాదు. దైవం సృజించిన లోకంలో నుంచి ఆయనే సృష్టించిన ఉపాధి మార్గాల ద్వారా తన వంతు వాటాను గ్రహించేందుకు ప్రయత్నించే హక్కు మానవులందరికీ సమంగా వుంది. కృషి చేసే సమానావకాశాలు అందరికీ లభ్యమవ్వాలి.

## ఆస్తి హక్కు

దైవం ఇచ్చిన వనరుల్లో వేటినయితే తయారు చెయ్యడానికీ, లేదా ప్రయోజనకరంగా చెయ్యడానికీ ఓ వ్యక్తి శ్రమపడటమో, తన సామర్థ్యాన్ని వినియోగించడమో జరగదో అవన్నీ సామాన్య ప్రజలందరికీ అందుబాటులో ఉండవలసిందే. అవన్నీ

అందరికీ వినియోగార్హమయినవే. ప్రతి మనిషికీ తన అవసరం కొద్దీ వాటిని వినియోగించుకునే హక్కు ఉంది. నదులూ, చెలమల నీళ్ళు, అడవిలోని కట్టె, ప్రకృతి సిద్ధంగా పెరిగిన చెట్ల పండ్లు, పశుమేత, అడవి జంతువులు, భూతలాన ఉండే గనులు నీరు, గాలి ఇత్యాది వాటిపై ఎవరి గుత్తాధిపత్యమూ సాగదు. ప్రజలు ఏమీ చెల్లించకుండా వాటిని ఉపయోగించుకునేందుకు, తమ అవసరాలు తీర్చుకునేందుకు వీల్లేకుండా మరెలాంటి ప్రతిబంధకాలూ విధించడానికీ వీల్లేదు. అయితే ఎవరయినా వ్యాపారం చేసే లక్ష్యంతో భారీ ఎత్తున ఈ వస్తువుల్ని లేక వీటిలో ఏదయినా ఒకదాన్ని వినియోగించుకోదలిస్తే అలాంటి వారిపై పన్ను విధించడం సబబే.

మానవుని ప్రయోజనానికి దైవం ప్రసాదించిన వాటిని అధీనంలో ఉంచుకు నిరుపయోగంగా పెట్టుకోవడం సరయిన విధానం కాదు. స్వయంగానయినా వినియోగించుకోవాలి లేదా ఇతరులయినా వినియోగించుకునేందుకు వాటిని వదలివెయ్యాలి. ఇదే సూత్రాన్ని ఆధారంగా తీసుకుని చట్టం చేసే నిర్ణయమేమిటంటే, ఏ వ్యక్తి అయినా సరే తన అధీనంలో ఉన్న భూమిని మూడేండ్ల వరకు నిరుపయోగంగా ఉంచలేడు. అతను దాన్ని సేద్యం కొరకో లేదా కట్టడంలో నిర్మించుకునేందుకో లేదా మరే అవసరానికో వినియోగించకపోతే మూడేళ్ళ తరువాత దాన్ని అతను వదిలేసిన ఆస్తి కింద జమకడతారు. మరే ఇతర వ్యక్తి అయినా దాన్ని ఉపయుక్తం చేసినట్లయితే అతనిపై ఎలాంటి దావా చెయ్యడం జరగదు. ఇస్లామీయ రాజ్యానికి కూడా ఇలాంటి పరిస్థితిలో ఆ భూమిని మరెవరికయినా అప్పజెప్పే అధికారముంటుంది.

ఏ వ్యక్తి అయినా ప్రకృతి సంపదల్లో నుంచి దేన్నయినా పరిగ్రహించి, దాన్ని తన శక్తి సామర్థ్యాలతో పరిశ్రమతో ఉపయుక్తం చేసుకున్నట్లయితే దానికి అతనే యజమాని. ఉదాహరణకు పోరంబోకు భూమిని (దానిపై ఎవరి హక్కు కూడానిర్ధారణ కాకపోయిన పక్షంలో)ఎవరైనా తన అధీనంలో తీసుకుని, దాన్ని ఏదయినా ఉపయోగకరమయిన పనికై వినియోగించుకున్నట్లయితే దాన్ని అతన్నుండి తిరిగి స్వాధీనం చేసుకోవడం అన్నది జరగదు

ఇస్లామీయ దృక్పథం ప్రకారం ప్రపంచంలో ఏ వస్తువుపై నయినా స్వామ్యం, దానికి సంబంధించిన హక్కులు ఈవిధంగానే ప్రారంభమయ్యాయి. ప్రారంభంలో ప్రపంచంలో మానవులు నివసించసాగినప్పుడు సకల వస్తువులపై సమస్త మానవులకు సర్వసామాన్యంగా సమాన హక్కులుండేవి. ఆ తరువాత ఏ వ్యక్తి ఇలా న్యాయబద్ధమయిన వస్తువును తన స్వాధీనం చేసుకుని ఉపయోగించుకున్నాడో అతను దానికి యజమాని అయ్యాడు. అంటే దాన్ని తానే వినియోగించుకునేందుకు ప్రత్యేకించుకునే హక్కు ఆ వ్యక్తికి ప్రాప్తమవుతుందన్న మాట. మరెవరైనా దాన్ని వినియోగించదలిస్తే అతను దానికి ప్రతిమూల్యాన్ని గ్రహించగలడన్న మాట. మానవుని సకల ఆర్థిక వ్యవహారాలకు ప్రకృతి సిద్ధమయిన మూలం ఇదే. ఈ ప్రాతిపదిక అలా స్థిరంగా ఉండవలసిందే.

శాసన రీత్యా ధర్మబద్ధమయిన విధానాల ద్వారా ఎవరికయినా లభించే యాజమాన్యపు హక్కులు గౌరవించదగినవే. అభ్యంతరం ఏదయినా ఉంటే అది, యాజమాన్యం చట్టంరీత్యా సరయినదేనా కాదా అన్న విషయంలో మటుకే కాగలదు. ఏ

స్వామ్యపు హక్కులు, యాజమాన్యపు హక్కులైతే చట్టంరీత్యా ధర్మబద్ధం కావో వాటిని అంతమొందించవలసిందే. కాని ఏ హక్కులయితే షరీఅత్ (చట్టం, శాసనాంగం) రీత్యా సరయినవో వాటిని ఏ ప్రభుత్వానికయినా, ఏ శాసనసభకయినా హరించే లేక షరీఅత్ ప్రసాదించిన ఆ హక్కుల్లో హెచ్చుతగ్గులుచేసే ఎలాంటి అధికారం లేదు. సాంఘిక సంక్షేమం పేరున షరీఅత్ ప్రసాదించిన హక్కుల్ని కాలరాచే ఏ వ్యవస్థకూ ఇస్లాంలో అవకాశం లేదు. సమాజ ప్రయోజనాల కోసం వ్యక్తుల యాజమాన్యపు హక్కులపై స్వయంగా షరీఅత్ విధించిన కట్టుబాట్లను తగ్గించటం ఎంత తీవ్రమయిన అన్యాయమో, ఆ నియమాలను పెంచడం కూడా అంతే ఘోరం, అత్యాచారం. వ్యక్తులకు షరీఅత్ అనుగ్రహించిన హక్కుల్ని పరిరక్షించి, షరీఅత్ నియమించిన సమాజం యొక్క హక్కుల్ని వ్యక్తుల ద్వారా పరిగ్రహించాలన్న సూత్రం ఇస్లామీయ రాజ్యం యొక్క విధుల్లోనే ఉంది.

## సమానత్వం – ఓ సమస్య

దైవం తన అనుగ్రహాలను, వరాలను పంచడంలో సమానత్వాన్ని పాటించలేదు తన వివేచన ఆధారంగా కొందరికి కొందరిపై విశిష్టతను ప్రసాదించాడు. సౌందర్యం, మధురమయిన కంఠం, ఆరోగ్యం, శారీరక, మానసిక శక్తిసామర్థ్యాలు, జననమొందిన వాతావరణం, ఇలాంటి అనేకవిషయాలు మానవులందరికీ సమంగా ప్రాప్తం కాలేదు. అలాగే ఉపాధి కూడా. దైవం సృజించిన ప్రకృతి సిద్ధమయిన ఏర్పాటు స్వయంగా మాన

వుల మధ్య ఉపాధి విషయంలో వ్యత్యాసముండాలన్న అవస రాన్ని సూచిస్తుంది. ఈ కారణాలవల్ల ఇస్లామీయ దృక్పథం దృష్ట్యా మానవుల మధ్య కృత్రిమంగా ఆర్థిక సమానత్వాన్ని స్థాపించడానికి జరిగే ప్రయత్నాలన్నీ వాటి లక్ష్యం దృష్ట్యాను, సిద్ధాంతం రీత్యాను పూర్తిగా తప్పయినవి. ఇస్లాం ఏ సమాన త్వాన్ని కాంక్షిస్తుందో అది ఉపాధిలో సమానత్వం కాదు. ఉపా ధిని సముపార్జించే అవకాశాల సమానత్వం, సమాజంలో ఏవ్యక్తి అయినా తన శక్తిసామర్థ్యాల మేరకు ఆర్థిక కృషి జరపకుండా చేసేచట్టపరమయిన లేదా సాంప్రదాయికమైన అవరోధాలు ఉండ రాదని అది కోరుకుంటుంది. అలాగే కొన్నివర్గాలకు, వంశాలకు, తెగలకు మాత్రమే జన్మతః ప్రాప్తమయిన 'సౌభాగ్యాన్ని' చట్ట పరమయిన రక్షణలద్వారా శాశ్వతమయినవిగా మార్చివేసే వివక్ష తలకు కూడా సమాజంలో చోటుండరాదని అది కాంక్షిస్తుంది. ఈ రెండు విధానాలు కూడా సహజసిద్ధమయిన అసమానతల స్థానే బలవంతంగా కృత్రిమమయిన సమానతలను స్థాపిస్తాయి. అందు వల్ల ఇస్లాం వీటిని రూపుమాపి సమాజంలో ప్రతివ్యక్తికీ కష్టించి సంపాదించే సమానావకాశాలు లభించేటటువంటి సహజమయిన స్థితిలోకి ఆర్థికవ్యవస్థను తీసుకురావాలని అభిలషిస్తుంది. అయితే ఎవరయితే కృషి చేసే అవకాశాలు, కృషిఫలితాలు - అన్నింటా జనుల్ని సమానులుగా చెయ్యాలని కోరుకుంటారో ఇస్లాం వారితో ఏకీభవించదు. ఎందుకంటే ఇలాంటి వారు నిజానికి సహజమైన అసమానతలను కృత్రిమంగా సమానతలుగా మార్చాలని అభిల షిస్తున్నారు. ఇది అసహజం. మానవనైజానికే విరుద్ధం. ప్రతి వ్యక్తి సృష్టికర్త తనను పుట్టించిన స్థితి, స్థాయిల నుండే ఉపాధి

సముపార్జనా రంగంలో, తన పరుగును ప్రారంభించాలి. ఇదే ప్రకృతికి సన్నిహితమయిన సహజమయిన మార్గం.

కారు తన భాగ్యంలో తీసుకువచ్చిన వాడు కారుతోనే తన పరుగు ప్రారంభించాలి. రెండు కాళ్ళు మటుకు తీసుకు వచ్చిన వాడు కాలినడకనే బయల్దేరాలి. కుంటివాడుగా పుట్టిన వాడు కుంటుకుంటూనే దౌడు తీయాలి. సమాజంలో చెలామణీలో ఉండే చట్టం మటుకు ఎలా ఉండాలంటే, కారుగలవాడికి శాశ్వతంగా కారుపై గుత్తాధిపత్యం ప్రాప్తమయి, కుంటి వాడికి కారు పొందడం అసాధ్యమయిపోరాదు. అలాగే అందరినీ బలవంతంగా ఒకే స్థితికీ, ఒకే స్థాయికి తెచ్చి అందరూ అక్కడి నుండే తమ పరుగు ప్రారంభించాలన్న కట్టడి పెట్టి అందరినీ పరస్పరం తప్పనిసరిగా కట్టిపడవెయ్యనూ రాదు. దీనికి భిన్నంగా సమాజంలో నియమనిబంధనలెలా ఉండాలంటే, జీవితంలో కుంటుతూ పరుగు ప్రారంభించిన వ్యక్తి తన శక్తిసామర్థ్యాలు, కృషి చేత కారును పొందగలిగితే దాన్ని తప్పక పొందాలి. అలాగే ప్రారంభంలో కారులో దౌడు తీసి తన అయోగ్యతల కారణంగా కుంటుబడితే అతను అలాగే ఉండిపోవాలి.

## సామాజిక న్యాయం

సామాజిక జీవితంలో ఈ ఆర్థికమయిన పరుగు స్వేచ్ఛగా, నిష్పక్షపాతంగా ఉండటం ఒక్కటే కాదు. ఇస్లాం కోరేదేమంటే, ఈ పరుగులో దౌడు తీసేవారు, పరస్పరం నిర్దయగా, సానుభూతి రహితంగా కూడా ప్రవర్తించుకోరాదు. సానుభూతి పరులయి,

సహకార వర్తనులయి మెలగాలి. ఒక వైపున అది తన నైతిక బోధనల మూలంగా, నిస్సహాయులయిన, వెనకబడిన తోటి సోదరుల్ని ఆదుకునే సద్బుద్ధిని ప్రజల్లోఉత్పన్నం చేస్తుంది. మరో వైపున సమాజంలో శాశ్వత ప్రాతిపదికపై ఓ సంస్థ ఉండి అది అనాధలకు, వికలాంగులకు, అగత్యపరులకు సహాయసహకారాలు అందజేసే హామీ యివ్వగలగాలని కోరుకుంటుంది. ఎవరయితే ఆర్థిక పరుగులో పాల్గొనలేకపోతారో వారు ఈ సంస్థ నుండి తమ వాటాను పొందాలి. ఎవరయితే అవకాశవశాత్తు ఈ పరుగులో పడిపోతారో వారిని ఈ సంస్థ పైకి లేవనెత్తి తిరిగి ముందుకు సాగే శక్తినివ్వాలి. మరెవరికయితే ఈ కృషిలో పాల్గొనేందుకు కొంత అండ అవసరమవుతుందో వారు ఈ సంస్థ ద్వారా దాన్ని పొందాలి.

ఈ ఆశయం కొరకు ఇస్లాం చేసిన చట్టం ప్రకారం దేశంలో నిల్వ ఉన్న మొత్తం సంపదపై సాలీనా రెండున్నర శాతం. అలాగే వ్యాపార పెట్టుబడులన్నింటిపై సాలీన రెండున్నర శాతం జకాత్ వసూలు చేయాలి. అలాగే సేద్యపు భూముల పంటపై కూడా పది శాతం లేక అయిదు శాతం వసూలు చెయ్యాలి. కొన్ని ఖనిజాల ఉత్పాదనలో ఇరవయి శాతం తీసుకోవాలి, పశు సంపద ఓ మోతాదుకు మించినప్పుడు ప్రత్యేకమయిన నిష్పత్తిలో సాలీనా జకాత్ వసూలు చెయ్యాలి. ఈ మొత్తం వసూళ్ళను నిరుపేదలకు, అనాధలకు, అగత్యపరులకు సహాయాన్నిఅందజెయ్యడానికి వినియోగించాలి. ఇదిఒకవిధమయిన సామాజికభీమా (Social insurance) ఇదేగనక స్థాపిస్తే సమాజంలో ఏ వ్యక్తి కూడా జీవితపు అత్యవసర వస్తువులకుగాను అల్లాడవలసి రాదు. కార్మికుడు కూడా పస్తులుండవలసి వస్తుందన్న భయంతో, కార్ఖానా యజమానులో,

భూస్వాములో నిర్ణయించిన షరతులకు లొంగి పని చెయ్యడానికి ఒప్పుకోవలసిన పరిస్థితులు రావు. ఏ వ్యక్తి ఆర్థిక స్థాయికూడా ఆర్థిక కార్యకలాపాల్లో పాల్గొనేందుకు కావలసిన కనీసపు స్థాయికి ఎన్నటికీ తగ్గజాలదు.

వ్యక్తి మరియు సమాజం మధ్యన ఇస్లాం సంతులనం ఏర్ప రచాలని కోరుతుంది. అందులో వ్యక్తియొక్క వ్యక్తిత్వం, అతని స్వేచ్ఛస్థిరంగానూ ఉండాలి, అతని ఈ స్వేచ్ఛ సామూహిక ప్రయోజ నాలకు భంగకరం కాకుండా ఉండాలి, పైపెచ్చు అది తప్పని సరిగా లాభదాయకమే కాగలగాలని అది అభిలషిస్తుంది వ్యక్తిని సమాజంలో విలీనం చేసే ఏ విధమయిన రాజకీయ, ఆర్థిక వ్యవ స్థను ఇస్లాం అంగీకరించదు. మనిషికి అతని వ్యక్తిత్వం సరయిన రీతిలో ఎదగడానికి స్వేచ్ఛ కావాలి. ఆ స్వేచ్ఛను హరించివేసే ఎలాంటి వ్యవస్థనూ అది ఆమోదించదు.

ఒక దేశంలోని సకల ఉత్పాదనా సాధనాలను జాతీయం చెయ్యడం వల్ల తప్పనిసరిగా జరిగే పరిణామం ఏమిటంటే, దేశం లోని ప్రజలందరూ సామూహిక వ్యవస్థ కబంధహస్తాల్లో చిక్కు కుంటారు. ఇలాంటి పరిస్థితిలో వారి వ్యక్తిగత ప్రత్యేకత పరి రక్షణ, దాని మనుగడ కష్టసాధ్యమే కాదు, అసాధ్యమయి పోతుంది. వ్యక్తిగత ప్రత్యేకతలు వృద్ధి పొందడానికి ఏ విధంగా నయితే రాజకీయ, సామాజిక స్వాతంత్య్రం అత్యవసరమో అలాగే ఆర్థిక స్వేచ్ఛ కూడా ఎంతో అవసరం. మనం మానవతను సమూలంగా తుడిచి పారవెయ్యడాన్ని సుతరామూ ఇష్టపడము. అలాంటప్పుడు ఒక వ్యక్తి తన బ్రతుకుతెరువును స్వేచ్ఛగా సంపా యించుకుని తనమనోగతభావాలనుస్థిరంగా నిలుపుకోగలిగేందుకు,

తన మానసిక, నైతిక శక్తుల్ని తన సొంత భావాలకనుగుణంగా పెంపొందించుకోగలందులకు మన సామూహిక జీవన రంగంలో తగినంత అవకాశం, ఫీల్డూ కల్పించాలి. ఒకరు తమ చేతి మీదుగా పెట్టే రేషను ఉపాధి ఎంత సమృద్ధిగా లభించినా అది ఇష్టకరం, అభిలషణీయం కాజాలదు. ఎందుకంటే దాని వల్ల మానవీయ ప్రగతిలో, నైతిక, ఆధ్యాత్మిక, వృద్ధివికాసాలలో వచ్చే లోపం కేవలం భౌతికమయిన బలపు వల్ల ఎన్నటికీ తీర జాలదు

ఇస్లాం పైన ప్రస్తావించిన వ్యవస్థను ఏ విధంగా సమ్మతించదో అదే విధంగా అది, వ్యక్తులకు సమాజంలోనూ ఆర్థిక వ్యవహారాల్లోనూ స్వేచ్ఛనుఇచ్చి పగ్గాలేని పశువుల్లా వదలివేసి. వారు తమ వాంఛల పరిపూర్తికై లేదా తమ స్వప్రయోజనాలకై సమాజాన్ని ఇష్టం వచ్చినట్లు నష్టపరచడానికి వీలు కల్పించే సామూహిక వ్యవస్థనూ ఒప్పుకోదు. ఈ రెండు అతివాదాల మధ్య ఇస్లాం అవలంబించిన మధ్యే మార్గం ఏమిటంటే మొదట వ్యక్తిని సమాజం కొరకు కొన్ని పరిధులకు, బాధ్యతలకు కట్టుబడి ఉండేలా చెయ్యాలి. ఆ తరువాత అతన్ని తన సొంత విషయాల్లో స్వేచ్ఛగా వదలి వెయ్యాలి. ఈ పరిధులు, బాధ్యతల వివరాలేమిటో విశదీకరించే అవకాశం ఇప్పుడు లేదు. వాటి సంక్షిప్తమయిన స్వరూపాన్ని మీ ముందుంచుతాను.

## బాధ్యతలూ, బంధనాలు

మొదట ఉపాధి సముపార్జనను తీసుకోండి [illegible] సంపాదనా మార్గాలు ధర్మమయినవా, అధర్మమయినవా [illegible]

యంలో ఇస్లాం కనబరచిన విచక్షణాత్మకమయిన సూక్ష్మదృష్టి ప్రపంచంలోని మరే చట్టమూ చూపలేదంటే అతిశయోక్తి కాదు. ఒక వ్యక్తి మరో వ్యక్తికో లేదా మొత్తం సమాజానికో నైతికంగానయినా, భౌతికంగానయినా నష్టం వాటిల్ల జేసి తన జీవికను సంపాయించుకునే మార్గాలను ఒక్కొక్క దాన్ని వెదకి హరాం (అధర్మమయినవి, నిషిద్ధమయినవి)గా నిర్ణయించింది మద్య పానం, మత్తుపదార్థాలు-వీటి తయారీ, అమ్మకం రెండూ నిషిద్ధమే. అలాగే అశ్లీలమయిన(సాహిత్యం, విభిన్న కళారూపాలు), నృత్యగాన వృత్తి, జూదం, బ్రాకెట్టు,లాటరీ, వడ్డీ ఊహాప్రధానమైన, వంచన పూర్వకమయిన వ్యాపారం, వివాదాస్పదమయిన బేరాలు; ఒక వ్యక్తికి ఖచ్చితంగా లాభసాటిగా ఉంటూ ఎదుటివానికి లాభం అనుమానాస్పదమయిన వాణిజ్య రూపాలు అన్నీ అధర్మమయినవే. ఇంకా వస్తువులు నిల్వ ఉంచి ధరలు పెంచటం, ఇంకా ఇలాంటి సమాజానికి కీడు కలిగించే అనేక వ్యాపార వ్యవహారాలు పూర్తిగా నిషేధించబడ్డాయి. ఈ విషయంలో గనక మీరు ఇస్లాం ఆర్థిక నియమాలను, శాసనాలను పరిశీలిస్తే నిషిద్ధమయిన విధానాల పట్టిక మీ ముందుకు వస్తుంది. నేటి పెట్టుబడిదారీ వ్యవస్థలో వీటిలోని అనేక విధానాలు వినియోగించడం మూలానే చాలా మంది కోట్లకు అధిపతులయ్యారు. ఇస్లాం ఈ విధానాలనన్నింటినీ చట్టపరంగా నిషేధిస్తుంది. మరే విధానాల్లోనయితే మనిషి ఇతరులకు నిజమయిన, ప్రయోజనకరమయిన సేవ చేసి న్యాయంగా దానికి తగిన ప్రతిఫలం పొందుతాడో అలాంటి విధానాల ద్వారా ధనసంపాదనకు స్వేచ్ఛనిస్తుంది.

ధర్మసమ్మతమయిన మార్గాల ద్వారా సంపాయించిన సంపదపై మనిషికి యాజమాన్యపు హక్కును అంగీకరిస్తుంది ఇస్లాం.

అయితే ఈ హక్కులు కూడా అపరిమితం కావు. అది మనిషిని కట్టడి చేస్తుంది, అతను, తాను సమ్మతమయిన మార్గాల ద్వారా సముపార్జించిన సంపాదనను సయితం ధర్మసమ్మతమైన మార్గాల్లోనే ఖర్చు చెయ్యాలి. ఖర్చులపై కూడా అది నియమించిన ఆంక్షలవల్ల మనిషి పరిశుద్ధమయిన నిజాయితీతో కూడుకున్న జీవితమయితే గడుపుకోగలడు కాని విలాసాల్లో ధనాన్ని కర్పూరంలా హరింపజెయ్యలేడు. హద్దులు మీరి, ఆడంబరాలకు, బాహ్య పటాటోపం కోసమని, ఇతరులపై తన దైవత్వం ముద్రవేయడానికని చేసే ఎలాంటి ఖర్చులనయినా చెయ్యలేడు. అనవసరపు ఖర్చుల కొన్నింటినయితే స్పష్టంగా చట్టపరంగానే ఇస్లామీయ శాసనాంగం నిషేధించింది. మరికొన్ని రూపాల్లో స్పష్టమయిన ఆదేశాల్లేకపోయినప్పటికీ ఇస్లామీయ రాజ్యానికి అధికారాలున్నాయి—తమ సంపదను వృధాగా ఖర్చుచేసే వారిని ప్రభుత్వ ఉత్తర్వులతో వారించేందుకు.

ధర్మబద్ధమయిన సమంజసమైన ఖర్చులు పోగా మిగిలిన ధనాన్ని మనిషి కూడబెట్టనూ గలడు, దాన్ని మరింత ధనం సంపాయించడానికి వినియోగించనూ గలడు. అయితే ఈ రెండు హక్కులపైనా ఆంక్షలున్నాయి, కూడబెట్టినట్లయితే ఓ నిర్ణీత మొత్తానికి మించిన ధరలపై రెండున్నర శాతం సాలీనా జకాత్ చెల్లించాలి. దాన్ని వ్యాపారంలో వినియోగించదలిస్తే ధర్మబద్ధమైన వ్యాపారంలోనే వినియోగించాలి. ధర్మ సమ్మతమయిన వ్యాపారం తాను స్వయంగా చెయ్యగలడు లేదా తన పెట్టుబడిని ధనం మూలంగానో భూమి, యంత్రాల రూపేణానో ఇతరులకు ఇచ్చి లాభనష్టాలో భాగస్వామి కూడా కాగలడు. ఈ రెండు

విధానాలూ ధర్మబద్ధమయినవే. ఈ పరిమితుల్లో పని చేస్తూ ఎవరయినా కోట్లాధిపతి అయినా ఇస్లాం దృష్టిలో ఆక్షేపణీయం కాజాలదు. అది దైవానుగ్రహమే కాగలదు. అయితే సామూహిక హితవు కోసం దానిపై అది రెండు షరతులు విధిస్తుంది. ఒకటి అతను తన వాణిజ్య సరకుపై జకాత్ చెల్లించాలి రెండవదేమంటే అతను, తానెవరితోనయితే వాణిజ్యంలో, పరిశ్రమల్లో, వ్యవసాయంలో భాగస్వామ్యమో, వేతనం ద్వారానో కలసి పని చేస్తాడో వారితో న్యాయంగా వ్యవహరించాలి. ఈ 'న్యాయం' అతను స్వయంగా చెయ్యకపోతే ఇస్లామీయ రాజ్యం, అతనిపై న్యాయంగా వ్యవహరించే నిర్బంధం తేగలదు.

పైగా ఇలా ధర్మసమ్మతమయిన మార్గాల్లో ఆర్జించిన సంపదను కూడా ఇస్లాం ఎంతో కాలం నిల్వ ఉండనివ్వదు. దాని వారసత్వపు చట్టం ప్రకారం తరం తరువాత మరో తరంలో అది పంపకం జరిగేలా ఒకే చోట నిల్వ ఉండకుండేలా చూస్తుంది. ఈ విషయంలో ఇస్లామీయ శాసనం ప్రపంచ శాసనాలన్నింటికీ భిన్నంగా వ్యవహరిస్తుంది. ఇతర చట్టాల ప్రకారం ఒకసారి పోగయిన ధనం తరతరాలుగా ఇంకా పోగవుతూనే ఉంటుంది. దానికి భిన్నంగా ఇస్లామ్ చేసే శాసనంలో ఒక వ్యక్తి తన జీవిత కాలంలో సంపాయించిన ధనం అతని మరణానంతరం అతని సమీప బంధువుల్లో పంపకం అయిపోతుంది. దగ్గరి బంధువులు తమతమ వాటా ప్రకారం వారసత్వం పొందుతారు. దూరపు బంధు

వులూ లేకపోతే ముస్లిం సమాజం దానికి వారసురాలవుతుంది. ఈ చట్టం పెద్ద పెట్టుబడిని, భూస్వామ్యాన్ని స్థిరంగా, శాశ్వతంగా నిలువనివ్వజాలదు. ముందు పేర్కొన్న సకలఆంక్షల తరువాత కూడా ధనం పోగయి ఏదైనా చెడుగు రూపుదాలుస్తే ఈ చివరి దెబ్బ (వారసత్వపు చట్టం) దాన్ని నివారించటానికి సరిపోతుంది.

—(౦)—

# 6

# ఇస్లాం బోధించే ఆధ్యాత్మిక మార్గం

ఇస్లాం ప్రతిపాదించే ఆధ్యాత్మిక మార్గం ఏది? జీవన వ్యవస్థ మొత్తంతో దాని సంబంధం ఎలాంటిది? అన్న ప్రశ్నల్ని అర్థం చేసుకునేందుకు, ముందు ఇస్లామీయ ఆధ్యాత్మిక భావనకు ఇతర మతపరమయిన తాత్విక భావనలకు మధ్యగల వ్యత్యాసాన్ని బాగా అర్థం చేసుకోవాలి. ఈ తారతమ్యం సరిగ్గా మనోగతం కాకపోవడంచేత తరచుగా మనిషి తికమకపడతాడు. దీని కారణంగా ఇస్లామీయ ఆధ్యాత్మిక మార్గాన్ని గురించి చర్చించేటప్పుడు సామాన్యంగా ప్రాచుర్యంలో ఉన్న "ఆధ్యాత్మికత" అనే పదానికి సంబంధించిన భావనలు మనిషి మస్తిష్కంలో వచ్చి తిష్ఠవేస్తాయి. ఆ తరువాత అతనికి మరిన్ని ప్రశ్నలు ఎదురయి చిక్కుల్లో పడవేస్తాయి. "ఇదీ ఒక ఆధ్యాత్మిక వ్యవస్థేనా ? ఇది సుపరిచితమయిన ఆధ్యాత్మిక పరిధుల్ని అధిగమించి భౌతిక, శారీరక రంగాల్లోనూ ప్రవేశిస్తుందేమిటీ ? ప్రవేశించడం ఒక్కటే కాదు, ఆ రంగాలపైనా ఆధిపత్యం చెలాయించాలని అంటుందేమిటీ ?" అని బిత్తరపోతాడు. అంతా అగమ్యగోచరంగా తయారవుతుంది అతనికి.

# శరీరం–ఆత్మల సంఘర్షణ

తాత్విక, మతపరమయిన రంగాల్లో సర్వసామాన్యంగా చెలామణిలో ఉన్న భావన ఏమిటంటే, ఆత్మ, శరీరం రెండూ ఒకదానికొకటి వ్యతిరేకమయినవి, రెండూ రెండు వేరు లోకాలకు చెందినవి. రెంటికి కావలసిన విషయాలు వేర్వేరయినవే కావు, పరస్పరం విరుద్ధమయినవి కూడా. ఈ రెండూ ఒకేసారి వృద్ధి చెందడమంటే సాధ్యపడే విషయం కాదు. ఈ శరీరం, ఈ భౌతిక ప్రపంచం ఆత్మకు ఓ బందీఖానాలాంటిది. ప్రాపంచిక జీవితపు బంధనాలు ఆత్మను పట్టి ఉంచిన బేడీలు, సంకెళ్ళు. ప్రాపంచిక వ్యాపకాలు, వ్యవహారాలన్నీ, మనిషి ఆత్మను ఇరికించివేసే ఊబిలాంటివి. వీటిలోపడ్డ మనిషి ఆత్మ ఉన్నత శిఖరాలకు ఎదగజాలదు, పైకి ఎగరజాలదు. ఈ భావన వల్ల కలిగే తప్పనిసరి పరిణామం ఏమిటంటే ప్రపంచ కార్యకలాపాలు, ఆధ్యాత్మికత రెంటి మార్గాలూ పూర్తిగా వేరయిపోతాయి. ఎవరయితే ప్రాపంచిక కార్యకలాపాల్లో నిమగ్నులయ్యారో వారు మొదటి అడుగులోనే నిరాశకు లోనయ్యారు— ఇక్కడ ఆధ్యాత్మికత తమతోపాటు సాగజాలదని. ఈ భావం వారిని భౌతిక తత్వంలో పూర్తిగా ముంచివేసింది. సామాజిక వ్యవస్థ, నాగరికత, రాజకీయాలు, ఆర్థిక వ్యవహారాలు— ప్రపంచ జీవితానికి సంబంధించిన అన్ని రంగాలలో ఆధ్యాత్మికత లోపించింది. వారు తమ ఆత్మ వికాసానికి ప్రపంచ వ్యవహారాలకు వెలుపల నుండి పోయే మార్గాలనే అన్వేషించసాగారు. ఎందుకంటే వారి దృక్కోణం ప్రకారం ఆధ్యాత్మిక వికాసానికి ప్రపంచంగుండా పోయే మార్గమేదీ అసలు లేనేలేదు. వారి ప్రకారం ఆత్మవికాసా

నికి శరీరాన్ని కృశింపజెయ్యడం అత్యవసరం. అందువల్ల వారు మనస్సును చంపి శరీరాన్ని జడపదార్థంగా లేక నిష్ప్రయోజనకరంగా తయారుచేసే సాధనాలను కనిపెట్టసాగారు. ఆధ్యాత్మిక సుశిక్షణకొరకని అడవుల్లోకి, కొండల్లోకి, ఏకాంత కుహరాల్లోకి పోవడమే ఎంతో సముచితమయినదిగా వారు భావించారు. తద్వారా నాగరిక ప్రపంచంలోని హంగామా అంతా వారి జ్ఞానధ్యాన నిమగ్నతల్లో ఎలాంటి అంతరాయం కలిగించకుండా ఉండాలని. ప్రపంచాన్ని, దాని కార్యకలాపాలను పూర్తిగా విసర్జించడం తప్ప. భౌతిక లోకంతో ముడివేసే బంధనాలన్నింటినీ తెంపుకోవడం తప్ప వారికి మరో మార్గం కానరాలేదు— తమ ఆత్మ వృద్ధివికాసాలను సుసాధ్యం చేసుకునేందుకు.

శరీరం, ఆత్మ రెంటిలోగల ఈ వైరుధ్యం మానవుని పరిపూర్ణత, పరిణతులకు కూడా రెండు విభిన్న భావాలు, రెండు వేర్వేరు లక్ష్యాలు జనింపజేశాయి. ఒకవైపునేమో ప్రాపంచిక జీవితంలో పరిపూర్ణత. దీని భావమేమంటే మనిషి కేవలం భౌతిక సౌలభ్యాలు, విలాస సామగ్రితో సుసంపన్నం కావాలి. దానికి చివరి అంచు లేక ఉన్నత శిఖరం ఏమిటంటే మనిషి పైపై కెగిరే పక్షిలా, బలమయిన మొసలిలా, మేలు రకం గుర్రంలా, క్రూరమయిన తోడేలులా తయారు కావాలి.* రెండోవైపున ఆధ్యాత్మిక జీవితానికి పరమార్థం పరిపక్వతకు భావం నిర్వచించడం జరిగింది. దాని ప్రకారం మనిషి కొన్ని మానవాతీత శక్తులను పొందాలి. ఆ

---

* అంటే మనిషి భౌతికతా ప్రగతి ద్వారా తన శక్తిసామర్థ్యాల రీత్యా మనిషిగాకాక 'జంతువు'లా రూపొందాలన్న మాట. నేడు భౌతికవాదం వెంట పట్టించుకున్న మనిషి అదే అయ్యాడు.

శక్తుల మహోత్కృష్ట స్థాయి ఏమిటంటే మనిషి ఒక గొప్ప ప్రభావవంతమయిన రేడియో సెట్‌గానో, శక్తిమంతమయిన దూరదర్శినిగానో, ఎంతో తీక్షణమయిన సూక్ష్మదర్శినిగానో మారి పోవాలి అతని ఒక్క చూపు, ఒక్క మాట పెద్ద అనుపత్రిలా పనిచెయ్యగలగాలి.*

## బందీఖానా కాదు, కార్ఖానా

ఇస్లాం దృక్పథం ఈ విషయంలో ప్రపంచంలోని మతాల న్నింటికీ, తత్వాలన్నింటికీ భిన్నమయింది. అది చెప్పేదేమంటే మానవాత్మను దేవుడు భూమిపై తన ప్రతినిధిగా నియమించాడు. కొన్ని బాధ్యతలు, విధులు దానికి అప్పగించాడు. వాటిని నిర్వ ర్తించడానికి ఎంతో శ్రేష్ఠమయిన, సముచితమయిన శరీరాన్ని ప్రసాదించాడు. మనిషి తన అధికారాలను వినియోగించుకో డానికి, తనకు సంబంధించిన బాధ్యతల్ని నిర్వర్తించడానికి సాధనంగానే ఈ శరీరాన్ని అతనికి అప్పగించడం జరిగింది. అందువల్ల ఈ దేహం మనిషి ఆత్మకు బందిఖానా కాదు, దాని కార్ఖానా! ఈ ఆత్మ వికసించాలన్నా, వృద్ధి చెందాలన్నా ఒకే మార్గం ద్వారా అది సాధ్యం. అది ఈ కార్ఖానాలోని యంత్రా లన్నింటినీ, శక్తులన్నింటినీ వినియోగించి తన సామర్థ్యాలను

* అంటే మనిషి ఆధ్యాత్మిక శక్తుల ద్వారా ఈ పరికరాలు చెయ్యగల కార్యకలాపాలన్నింటినీ నిర్వహించాలన్న మాట! బాబాల మహిమలు, వారి భక్తులు ప్రచారం చేసే గాథలు ఈ మాటల్లోని సత్యాన్ని రూఢపరుస్తున్నాయి.

ప్రదర్శించాలి. అలా చేసినప్పుడు ఈ ప్రపంచం, మానవుని ఆత్మవచ్చి, దురదృష్టవశాత్తు చిక్కుకుపోయిన బందీఖానా కాదు. శిక్షాగృహం కాదు. దీనికి భిన్నంగా ఇదో కార్యరంగం.

ఇందులో పనిజెయ్యడానికే దేవుడు ఆత్మను పంపించాడు. ఇక్కడి అసంఖ్యాకమయిన వస్తువులు దాని అధీనంలో ఇవ్వబడ్డాయి. ఇక్కడ ఇతర మానవులు అనేక మంది ఈ ప్రాతినిధ్యపు బాధ్యతను నిర్వర్తించడానికే దానితో పాటు ప్రభవింపజెయ్యబడ్డారు. ఇక్కడ ప్రకృతి సహజ ధర్మాలరీత్యా నాగరిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ తదితర జీవన రంగాలు దీనికొరకు ఉనికిలోకి వచ్చాయి.

ఇక్కడ ఏ ఆధ్యాత్మిక వికాసమయినా సాధ్యమవాలంటే, దానికి మార్గం, మనిషి ఈ కార్యరంగానికి విముఖుడయి ఏ మూలకోపోయి కూర్చోవడం ద్వారా ప్రాప్తంకాదు. దానికి సరయిన మార్గం, అతడు ఇందులో పనిచేసి తన సామర్థ్యాన్ని నిరూపించుకోవడం ఒక్కటే. ఇది అతనికి ఓ పరీక్షా క్షేత్రం. జీవితంలోని ప్రతి రంగం, ప్రతి కోణం ఓ పరీక్ష పత్రం లాంటిది ఇల్లు, వీధి, బజారు, ఆఫీసు, కర్మాగారం, బడి, న్యాయస్థానం,పోలీసు స్టేషను, సైనిక స్థావరం, పార్లమెంటు, శాంతి సభలు, రణరంగాలు-అన్నీ విభిన్న విషయాల పరీక్షా పత్రాలు. ఇవి ఇతనికి సరయిన సమాధానం వ్రాయడానికి ఇవ్వబడ్డాయి. అతను వీటిలో ఏ ఒక్క దాన్ని వ్రాయకపోయినా, లేదా అనేక పత్రాలను ఏమి వ్రాయకుండా వదలివేసినా ఫలితంగా లభించేది పెద్ద సున్న తప్ప మరేమీ కాదు. విజయం, సాఫల్యం, ఉత్తీర్ణత, ప్రగతి అన్నది సాధ్యం కావాలంటే ఒకటే మార్గం. అతడు తన కాలం

మంతా, తన శ్రద్ధాసక్తులన్నీ పరీక్షను సక్రమంగా ఎదుర్కొనేం దుకు వినియోగించాలి. తనకు ఇవ్వబడిన పరీక్షా పత్రాలన్నింం టిలో ఎంతో కొంత కృషి చేసి చూపెట్టాలి.

ఈ విధంగా ఇస్లాం, జీవితంలో సన్యాసత్వపు భావనను తిరస్కరిస్తుంది, మానవుని ఆధ్యాత్మిక వికాసానికి మార్గం, ప్రపంచానికి వెలుపలగా కాక ప్రపంచం గుండానే నిర్మించి చూపెడుతుంది. ఆత్మ వికాసం, ఆత్మతేజం, ఆత్మ పరిణతి, సాఫల్యం, పరమార్థం అనేవన్నీ సాధించడానికి అనువ యిన స్థలం, ఇస్లామీయ దృక్పథం ప్రకారం సరిగ్గా సంసారసాగరంలోని సుడి గుండం మధ్యనే ఉంది—దాని తీరాన కాదు.

## ఆధ్యాత్మిక వికాసానికి గీటురాయి

ఇస్లాం మన ఆత్మ వికాసానికి, పతనానికి నిర్ణయించే ప్రమాణం ఏమిటో ఇక చూడాలి. దీనికి సమాధానం ఇంతకు క్రితమే ప్రస్తావించిన ప్రాతినిధ్యపు బావన(ఖిలాఫత్)లోనే ఉంది. దైవానికి ప్రతినిధి అవడంచేత మనిషి తన జీవన కార్యకలాపాల నన్నింటికీ దైవం సమక్షంలో బదులు చెప్పుకోవలసి ఉంది. ఏ అధికారాలనయితే ఇచ్చి మనిషిని ధరణిలోకి పంపడం జరిగిందో, ఏ సాధనా సంపత్తిని ప్రసాదించడం జరిగిందో వాటి నన్నింటినీ దైవానికి ఇష్టమయిన రీతిలో వినియోగించడం మనిషి విద్యుక్త ధర్మం. అతడు ఇతర మానవుల ఎడల ఏ విభిన్న సంబంధ బాంధవ్యాలుకలిగి జీవిస్తున్నాడో ఆ సంబంధాలపట్ల దైవానికి ఇష్ట మయిన వైఖరిని అవలంబించాలి. మొత్తం మీద అతని సకల

ఖయత్నాలు, శ్రమ అంతా వినియోగమయి, భువిలో మానవ జీవితపు వ్యవస్థీకరణ, దేవుడు ఏమేరకు ఉత్తమ స్థాయిలో జరగాలని అభిలషిస్తున్నాడో ఆ మేరకు అంతా సజావుగా జరిగేలాచూడాలి. ఈ కర్తవ్యాన్ని మనిషి ఎంతగా బాధ్యతా భావంతో, ధర్మనిరతితో విధేయతతో ఆజ్ఞాపాలనాభావంతో, ప్రభువు ప్రసన్నతను బడయాలన్న కోరికతో నిర్వర్తిస్తాడో అంతగానే అతడు దైవానికి చేరువవుతాడు. దైవసామీప్యమే ఇస్లాం దృష్టిలో ఆధ్యాత్మిక వికాసం. దీనికి భిన్నంగా అతడు ఎంతగా సోమరితనంతో, అలసత్వంతో, బాధ్యతారాహిత్యంతో, తిరుగుబాటు ధోరణితో, విద్రోహక వైఖరితో, అవిధేయతతో ప్రవర్తిస్తాడో అతను అంతగానే దైవానికి దూరమవుతాడు. దైవానికి దూరమవడమే ఇస్లాం దృష్టిలో ఆధ్యాత్మిక పతనం.

ఈ వివరణవల్ల విశదమయ్యేదేమంటే, ఇస్లామీయ దృక్పథం ప్రకారం లౌకిక వ్యక్తి, పారలౌకిక వ్యక్తి ఉభయుల కార్యరంగమూ ఒకటే. ఒకే కార్ఖానాలో ఇద్దరూ పని చేస్తారు. ఈ కార్ఖానాలో లౌకిక వ్యక్తికన్నా పారలౌకిక లేక ధార్మిక వ్యక్తియే మరింత అధికోత్సాహంతో దీక్షతో పనుల్లో నిమగ్నుడై ఉంటాడు. ఇంటి నాలుగు గోడలు మొదలుకుని, అంతర్జాతీయ మహాసభల వరకు జీవితానికి సంబంధించిన అన్ని రంగాల్లోనూ, సకల వ్యవహారాల్లోనూ ధార్మిక వ్యక్తి కూడా లౌకిక వ్యక్తికి సమానంగా, ఇంకా అతనికన్నా అధికంగా బాధ్యతల్ని కూడా నిర్వర్తించడానికి ముందుకు వస్తాడు.

ఈ ఉభయుల మార్గాలను వేరుచేసే విషయం ఒకటుంది. అది దైవంతో వారి సంబంధం. ధార్మిక వ్యక్తి ఏది చేసినా తాను

దైవానికి జవాబుదారుడు అన్న భావంతో చేస్తాడు ; దైవ ప్రసన్నత బడయాలన్న లక్ష్యంతో చేస్తాడు; దైవం అతనికై నిర్ణయించిన శాసనం, నియమం ప్రకారం చేస్తాడు. దానికి భిన్నంగా లౌకిక వ్యక్తి చేసేదంతా బాధ్యతారహితంగా చేస్తాడు ; దైవం పట్ల ఎలాంటి బాధ్యతాభావం లేకుండా చేస్తాడు ; తనకు ఇష్టమయిన రీతిలో చేస్తాడు. కేవలం ఈ వ్యత్యాసం ధార్మిక వ్యక్తి యొక్క భౌతిక జీవితాన్నంతటినీ ఆధ్యాత్మిక జీవనంగా మార్చివేస్తుంది. లౌకిక వ్యక్తి యొక్క జివితాన్ని ఆధ్యాత్మిక కాంతి లేకుండా చేస్తుంది.

## ఆధ్యాత్మిక పథం

ఇప్పుడు క్లుప్తంగా, ప్రాపంచిక జీవితపు ఈ సుడిగుండంలో మానవుని నైతిక పరిణామ ప్రగతుల మార్గాన్ని ఇస్లాం ఎలా నిర్మిస్తుందో చూద్దాము.

ఈ మార్గంలో తొలిమెట్టు విశ్వాసం (ఈమాన్). అంటే మనిషి మనోమస్తిష్కాల్లో ఒక భావన తిష్ఠవెయ్యటం ; దేవుడే అతని స్వామి అని, పరిపాలకుడని, ఆరాధ్యుడని, దైవప్రసన్నతే అతని సకల కార్యకలాపాల ఆశయం కావాలని, దైవాదేశమే అతని జీవన నియమావళి అని. ఈ భావన ఎంత చెరగనిదిగా, సుస్థిరంగా నిలిచిపోతుందో ఇస్లామీయ ఆలోచనా విధానం అతనిలో అంతగానే పరిపూర్ణత సంతరించుకుంటుంది. అంతే స్థిరచిత్తంతో మనిషి ఆధ్యాత్మిక ప్రగతివికాసాల మార్గాన పయనిస్తాడు.

ఈ మార్గంలో రెండో మజిలి విధేయత. అంటే మనిషి క్రియాత్మకంగా తానయి స్వేచ్ఛాస్వతంత్రతల్ని వదలి ఆచరణాత్మకంగా తాను విశ్వాసం రీత్యా తన దైవంగా నమ్మిన దేవుని దాస్యాన్ని అవలంబించడం. ఈ విధేయతకే కుర్అన్ పరిభాషలో ఇస్లాం అనంటారు.

మూడో దశ 'తక్వా' (భయభక్తులు, నిష్ఠా). దీన్ని సాధారణ భాషలో బాధ్యతా భావన, విధి నిర్వహణ అని నిర్వచించవచ్చు. 'తక్వా' ఏమిటంటే, మనిషి తన జీవితంలోని ప్రతి కోణం, ప్రతి విభాగంలోనూ పనిచేసేటప్పుడు తాను తన తలంపులకు, మాటలకు, చేతలకుగాను దైవానికి బదులు చెప్పుకోవలసి ఉందన్న బావనతో మసలుకోవాలి. దైవం నిషేధించిన ప్రతి పనిని మానుకోవాలి. దైవం ఆదేశించిన ప్రతి కార్యనిర్వహణకై నడుం బిగించాలి. ఇంకా పూర్తి బుద్ధికుశలతతో ధర్మసమ్మతమయినదీ, అధర్మమయినదీ, సరయినదీ, తప్పయినదీ, మంచిదీ, చెడ్డదీ— అన్నింటి మధ్య విచక్షణ కనబరుస్తూ ముందుకు సాగాలి.

చివరిది, అత్యున్నతమయిన మజిలి ఇహ్సాన్ (సర్వోత్కృష్టత)కు సంబంధించినది. ఇహ్సాన్ అర్థమేమంటే, దాసుని ఇష్టం దైవాభీష్టంతో ఏకమయిపోవాలి. దేవునికి ఇష్టమయినదే దాసుని సొంత ఇష్టమూ కాగలగాలి. మరేది దైవానికి అయిష్టమయిందో దాసుడు కూడా మనసారా దాన్ని ఇష్టపడకుండా ఉండాలి, దేవుడు ఏ చెడుగులనయితే తన భువిపై చూడడానికి ఇష్టపడడో, దాసుడు స్వయంగా వాటికి దూరంగా ఉండాలి. అంతేకాదు, ప్రపంచం నుండి వాటిని రూపుమాపడానికి తన శక్తు

లన్నింటినీ, తన సాధనాసంపత్తులన్నింటినీ వినియోగించివెయ్యాలి దేవుడు ఏ మంచివాటితో తన ధరిత్రిని సంశోభితం చెయ్యదలి చాడో, దాసుడు వాటితో కేవలం తన జీవితాన్ని తీర్చిదిద్దుకోవ డంతో ఆగరాదు, తన ప్రాణాలొడ్డి అయినా సరే ప్రపంచమం తటా వాటిని వ్యాపింపజెయ్యడానికి, వాటిని నెలకొలపడానికి కృషిచెయ్యాలి. ఈ దశకు చేరుకున్నప్పుడు దాసునికి తన దైవంతో అత్యంత సన్నిహితత్వం ప్రాప్తిస్తుంది. అందువల్లనే ఇది మానవ ఆధ్యాత్మికతకు అత్యున్నత సోపానంగా పరిగణించబడుతుంది.

ఆధ్యాత్మిక ప్రగతికి సంబంధించిన ఈ మార్గం కేవలం వ్యక్తుల వరకే పరిమితం కాదు. జాతులు, సమాజాలకు కూడా వర్తిస్తుంది. ఒక వ్యక్తి మాదిరిగానే ఒక జాతి కూడా విశ్వాసం, విధేయత, భయభక్తుల దశలు దాటి ఇహ్సాన్ (సర్వోత్కృష్టత) యొక్క అత్యున్నత సోపానాన్ని చేరగలదు. ఒక రాజ్యం కూడా దాని మొత్తం వ్యవస్థతోపాటు, విశ్వాసి (మోమిన్)గా, విధేయి (ముస్లిమ్)గా, భయభక్తులుగలది (ముత్తకీ)గా, ఉత్కృష్టతను పొందింది (ముహ్సిన్)గా అలరారగలదు. నిజానికి ఇస్లాం ఆశయం నెరవేరాలంటే, ఒక జాతి యావత్తు ఈ మార్గాన పయ నించి, ప్రపంచంలో ఒక ముత్తకి, ముహ్సిన్ రాజ్యస్థాపన జరిగి తీరవలసిందే.

ఇకపోతే ఆధ్యాత్మిక రంగంలో సుశిక్షణకై ఇస్లాం ప్రతిపా దించిన వ్యవస్థను చూద్దాము. ఇందులో వ్యక్తుల్ని, సమాజాన్ని పై విధంగా మలచడానికి అది ఏర్పరచిన విధానమేదో చూడాలి. ఈ వ్యవస్థలో నాలుగు మూలస్తంభాల్లాంటి అంశాలున్నాయి.

మొదటిది నమాజ్. ఇది ప్రతి దినం అయిదు పూటలా మానవ హృదయంలో దేవుణ్ణి గుర్తుచేస్తుంది. ఆయన భయ భక్తుల్ని ప్రేరేపిస్తుంది. ఆయన పట్ల ప్రేమను సృజిస్తుంది. ఆయన ఆదేశాలు మాటిమాటికీ ప్రత్యక్షపరుస్తుంది. ఆయన విధేయతను అభ్యసింపజేస్తుంది, నమాజ్ కేవలం వ్యక్తిగత స్థాయిలో కాదు. సామూహికంగా కూడా విధిగా నిర్ణయించడం జరిగింది. తద్వారా మొత్తానికి సమాజంలో అంతటా ఆధ్యాత్మిక వికాస మార్గాన పయనించేందుకు సంసిద్ధత ఏర్పడాలని.

రెండవ మూల స్థంభం రోజా (ఉపవాసవ్రతం). ఇది ప్రతి ఏటా పూర్తిగా ఒక్క నెల ముస్లిములను వ్యక్తిగతంగానూ, మొత్తం ముస్లిం సమాజాన్ని సామూహికంగాను 'తక్వా'కై శిక్షణ గరపుతుంది

మూడవ స్థంభం జకాత్. ఇది ముస్లిమ్ వ్యక్తుల్లో ధన త్యాగానికి పరస్పర సానుభూతికి, సహాయసహకారానికి కావలసిన ఉత్తమ భావాలు జనింపజేస్తుంది. కొందరు నేడు జకాత్‌ను తప్పుగా 'టాక్సు' అని అభివర్ణిస్తారు. వాస్తవానికి జకాత్ మౌలిక భావన టాక్సు మౌలిక భావానికి పూర్తిగా భిన్నమయింది. జకాత్ అంటే వృద్ధివికాసాలని. పరిశుద్ధత అని అర్థం. ఈ పదాన్ని ప్రయోగించి ఇస్లాం మనిషికి ఓ యదార్థాన్ని బోధిస్తుంది. నీవు దైవ ప్రేమ కారణంగా నీ సోదరులకు చేసే ధన సహాయం నీ ఆత్మవికాసానికి, నీ నైతిక ప్రవర్తనలో పరిశుద్ధతకు దోహదపడు తుంది అన్నది.

నాల్గవ మౌలికాంశం హజ్. దైవ భక్తి కేంద్రంగా ఇది విశ్వాస జనుల ఓ విశ్వజనీన సోదరత్వాన్ని సృజిస్తుంది. ఒక అంతర్జాతీయ ఉద్యమాన్ని నడుపుతుంది ఆ ఉద్యమం ప్రపంచంలో శతాబ్దాల తరబడి సత్యసందేశానికి ప్రతిస్పందిస్తూ ముందుకు వచ్చి లబ్బయేక్ అని ఆ పిలుపును అందుకుంటోంది. ఇన్షా అల్లాహ్ దైవచిత్తమయితే అనంత కాలం వరకు అలా అందుకుంటూనే ఉంటుంది.

—: సమాప్తం :—

ఇస్లాం మతం కాదు,
ఓ జీవిత విధానం,
ఓ సమగ్ర జీవన వ్యవస్థ.

ఇది సైద్ధాంతికమయిన చిక్కు ముడుల కుప్ప కాదు,
ఎంతో సునాయాసంగా ఇట్టే బోధపడే సాధారణమైన,
సహజమయిన విషయాలు.

మతం సైంటిఫిక్ యదార్థమా?
ఆశ్చర్యపోనవసరం లేదు.

ఈ విషయాలను తెలుసుకోవాలంటే — చదవండి —

# ఇదియే ఇస్లాం

వివరాలకు :
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్ కోట్, ఛత్తాబజార్,
హైదరాబాదు–2